# స్టీవెన్‌సన్ కథలు

మొదటి భాగము



అనుసరణ :

ఎస్. కె. వెంకటాచారి, యం. ఏ.,

ప్రకాశకులు :

మారుతిరామా అండ్ కో., విజయవాడ

విద్యావిషయక ప్రచారకులు

# బంగారుదీవి

## 1

నా పేరు జిమ్‌హాకిన్సు. మిత్రులగు జమీందారు ట్రెలానీ, డాక్టరు లివసీ మున్నగువారి కోరికపై బంగారుదీవికి సంబంధించిన పూర్తికథను వ్రాయుచున్నాను.

మా నివాసము బ్రిస్టలునగర ప్రాంతము. సముద్ర తీర సమీపమునఁగల 'ఎడ్మిరల్ బెంబో' అను పూఁటకూళ్ళ యింటికి మా తండ్రి యజమాని.

ఒకనాఁడు మా పూఁటకూళ్ళయింటికి నరువదియేండ్లకుఁ బైఁబడియుండు నొక ముదుసలి వచ్చెను. అతని యాకార మాతఁడొక నావికుఁడని స్పష్టముగాఁ దెల్పుచుండెను. అతఁడు పట్టి త్రాగుఁబోతు.

నావికుఁడు చాల మితభాషి. పగలంతయు నతఁడు బయటకుఁ బోయి దూరదర్శిని సహాయ్యమున నేమో పరిశీలించుచుండెడివాఁడు. సాయంకాల మింటికి రాఁగానే యెవరైన నితర నావికులచటకు వచ్చిరా యని యడుగుచుండెడివాఁడు. తోడి నావికుల సాహచర్యమున కాతఁడు పరితపించుచుండెనని మొదట మేము భావించితిమి. కాని యతఁడు వారినిగూర్చి భయపడుచుండెనని తరువాతఁ దెలియనాయెను.

ఒకనాఁ డా వృద్ధనావికుఁడు నాతో నిట్లనెను. "ఒంటికాలు గల నావికుఁ డొకఁ డిటకువచ్చును. నీవు జాగరూక

తతోఁ జూచి నాకు వెంటనే చెప్పవలెను. నీకుఁ బ్రతినెల నాలుగు పెన్నీల నిత్తును."

వృద్ధనావికుఁడు రాత్రులందుఁ బెద్ద గొంతుకతోఁ బాటలు పాడెడివాఁడు. కథలు చెప్పుచుండెడివాడు. వినని వారిని బెదరించుచుండెడివాఁడు. ఈ యల్లరివలన మా పూఁట కూళ్ళ యింటి బేరము తగ్గిపోవునని మా తండ్రికి దిగులు జనించెను. అదియుఁగాక యతఁడు వచ్చి కొన్ని నెలలైనను మొదటనిచ్చిన డబ్బుగాక మఱింకేమియు నీయలేదు. మా తండ్రి యిదివఱకే యనారోగ్యవంతుఁడు. ఈ క్రొత్త దిగులుతో నాతఁడు మంచముపట్టెను.

డాక్టరు లివసి మా తండ్రికి వైద్యము చేయుచుండెడివాఁడు. అతఁడు వృద్ధనావికుని ప్రవర్తనమును జూచి యాతనిని బెదరించెను. దానితో నాతఁడు కొంత శాంతించెను.

వృద్ధనావికుఁడు బయటకుఁ బోయియున్న సమయమున నాతని కొఱకు కొకఁడు లోనికివచ్చెను. అతని యెడమచేతికి రెండు వ్రేళ్ళు లేవు. కొంతసేపైన తరువాత వృద్ధనావికుఁడు లోనికి వచ్చెను. అపుడు నూతనుఁడు 'బిల్' అని యఱచెను. వృద్ధనావికుఁ డాతనిని జూచి 'నల్లకుక్క' అనిమాత్ర మనఁగలిగెను.

"మన మిరువురమును మాటాడుకొనవలసి యున్నది" అని నూతనుఁ డనెను. వారిరువురును నన్ను బయటకుఁ బంపివైచిరి. వా రిరువురును లోపల నేమేమో మాటాడుకొనిరి. నాకేమియు వినఁబడకుండెను. చివరకు వృద్ధనావికుఁ డిట్లనెను.

"ఉరిశిక్షయైనచో నందఱకు విధింపవలసినదే" తరువాత లోన, గుర్చీలచప్పుడు, కత్తులచప్పుడు విననాయెను. అంతలో నూతనుఁడు బయటకుఁ బారిపోయివచ్చెను. వృద్ధనావికుఁ డాతనిని వెన్నంటెను. తన చేతనున్న కత్తి నా నూతనుని పైకి విసరివైచెను. అదృష్టవశమున నది యాతనికిఁ దగులక 'బెన్ బౌ' నామఫలకమునకుఁ దగిలెను. నూతనుఁడు పారిపోయెను.

తరువాత వృద్ధనావికుఁడు మూర్ఛిల్లెను. అంతలో డాక్టరు లివసి యటకు వచ్చెను. నావికునకుఁ దగిన చికిత్సను జేసినతరువాత నాతనిని మేడపైకిఁ దీసికొనిపోతిమి. "ఇంకనీవు మత్తుపానీయములను ద్రాగినచో మరణింతు"వని లివసి వృద్ధ నావికుని హెచ్చరించెను.

లివసి వెడలిపోయిన కొంతసేపటికి, నావికునకు 'రమ్ము' పానీయము నందిచ్చుటకుఁ బోతిని. అప్పుడాతఁడు నాతో నిట్లనెను. "నేను ఫ్లింటు అను సముద్రపు దొంగలనాయకుని నావలోని యుద్యోగిని. అతఁడు మరణించునపు డాతని రహస్య పత్రములుగల పెట్టెను నాకిచ్చెను. ఆ పెట్టెకొఱ కాతని యితర యనుచరులు నన్ను వెంటాడుచున్నారు. నాకు 'నల్ల చుక్క' నీయఁదలఁచినారు."

"నల్లచుక్కయన నేమి?"

"అదియొకపిలుపు. అది వచ్చినప్పుడు నీకుఁ దెల్పెదను. అపుడు నీవు పోయి లివసికిఁ దెల్పి ఫ్లింటు అనుచరుల నందఱను బట్టుకొనునట్లు చేయవలెను. ఈ లోపల నల్లచుక్కగాని,

ఒంటికాలు కుంటివాడుగాని వచ్చునేమో జాగ్రత్తతోఁ జూచుచుండుము."

అంతలో మా తండ్రి మరణించెను. అందువలన వృద్ధ నావికుని మాటలఁగూర్చి తగినచర్యలఁ దీసికొనలేకపోయితిని. నావికుని యారోగ్యము నానాఁటికిఁ దగ్గుచుండెను.

ఒకనాఁ డొక గ్రుడ్డివాఁడు చేతికఱ్ఱతో నేలపై 'టక టక' ధ్వనిచేయుచు మా పూఁటకూళ్ళ యింటిముందుకు వచ్చెను. "నే నిప్పుడెక్కడున్నాను?" అని యాతఁడు ప్రశ్నించెను. "ఎడ్మిరల్ బెన్‌బౌవద్ద నున్నా"వని జవాబొసంగితిని. "నన్ను లోనికిఁ దీసికొని పొమ్మ"ని యాతఁడు నన్నుఁ గోరెను. ఆతని చేతినిఁ బట్టుకొని లోనికిఁ దీసికొని పోఁదొడఁగితిని. "వృద్ధనావికునివద్దకుఁ దీసికొనిపొ"మ్మని యాతఁ డాజ్ఞాపించెను. "అట్లే"యని యాతనివద్దకుఁ దీసికొనిపోతిని. అతని కోరికపై వారిరువురి చేతులను గలిపితిని. గ్రుడ్డివాఁడు, వృద్ధ నావికుని చేతిలో నేమో పెట్టెను.

"నా పని పూర్తియైనది" అని గ్రుడ్డివాడు నేలపైఁ గఱ్ఱతో 'టకటక' ధ్వనిచేయుచు, నా సాహాయ్యము లేకనే బయటకుఁ బోయెను. నేనాశ్చర్యపడితిని.

వృద్ధనావికుఁడు చేతిలోని దానినిఁ జూచెను. ఏమున్నది! నల్లచుక్క!! "ఇంకను నాలుగుగంటల కాలమున్నది. ఈ లోపల నేను దప్పించుకొనఁగలను"అని వృద్ధనావికుఁ డనెను.

అతఁడు చివాలున లేవఁబోయెను. కాని యొక్కపరి చాపచుట్టవలె నేలపైఁబడెను. కదలలేదు, మెదలలేదు. వృద్ధ నావికుఁడు మరణించెను.

## 2

వెంటనే వృద్ధనావికుని మరణవిషయమును నా తల్లికిఁ దెల్పితిని. మే మిరువురమును సమీప గ్రామమునకుఁ బోయి దొంగలవిషయమును దెలిపి మాకు సాహాయ్యమొనరింప వలసినదని గోరితిమి; కాని వారు భయపడి నిరాకరించిరి.

వృద్ధనావికుఁడు మా కీయవలసిన డబ్బు నెట్లయిన నాతని పెట్టెనుండి సంగ్రహింపవలెనని తిరిగి యింటికిఁ జేరు కొంటిమి. వృద్ధనావికుని మెడలోనున్న తాళపుచెవి సాహాయ్యమున నాతని పెట్టెను దెఱచితిమి. మాకు రావలసినంత డబ్బును మాత్రమే తీసికొని, మిగిలిన డబ్బును వదలివైచుటకు నిశ్చయించితిమి. అంతలో గ్రుడ్డివాని కఱ్ఱచప్పుడు విననాయెను. ఈలధ్వనులు గూడా విననాయెను. మా తల్లి యంతవఱకుఁ దీసికొన్న ధనముతో సంతృప్తిఁ జెందెను. నే నొక గుడ్డలోఁ జుట్టిన కాగితముల కట్టను దీసికొంటిని.

ఇరువురమును బయటపడి సమీప గ్రామమువైపునకుఁ బోసాగితిమి. కొద్దిదూరము పోవుసరికే మా యమ్మ మూర్ఛిల్లెను. నే నామె నటుఁగల వంతెన నీడలోని కీడ్చుకొనిపోతిని. నేనును నటనే కూర్చుండియుంటిని.

సముద్రపుదొంగలు మా యింటిని సమీపించిరి. అందు గ్రుడ్డివాఁడు గూడ నుండెను. అందఱును లోనికి బోయిరి.

"నావికుఁడు మరణించినాఁడు" అని యొకఁ డనెను.

"బాగుగా వెదకుఁడు" అని గ్రుడ్డివాఁ డాజ్ఞాపించెను.

"పెట్టెను మనకంటె ముందుగా నెవరో వెదకినారు. అందు ప్లింటుకాగితము లెవ్వియు లేవు" అని మఱియొకఁడనెను. "వానిని బూటకూళ్ళయింటి కుఱ్ఱవాఁడే తీసియుండును. ఇల్లంతయు వెదకుడు" అని గ్రుడ్డివాఁడనెను. ఇల్లంతయు గొప్ప ధ్వని చేయుచు వెదకిరి. నా కంతయు వినఁబడుచునే యుండెను. మే మింటలేమని దొంగలు గ్రహించి, సమీపప్రాంతములను వెదకుటకు నిశ్చయించిరి.

అంతలో గుఱ్ఱపుడెక్కల చప్పుడు వినినాయెను. ఆ సవ్వడికి దొంగ లెక్కడివారక్కడ పారిపోయిరి. గ్రుడ్డివా డొక గుఱ్ఱము క్రిందఁబడి మరణించెను. ఆ గుఱ్ఱములమీఁద వచ్చినవారు దొంగవ్యాపారమును నిరోధించుట కేర్పఱుపఁబడిన ప్రభుత్వోద్యోగులు. వారు నన్ను, మా తల్లిని మా యింటికిఁ జేర్చిరి. నేను వారి యధికారితో నా వద్దఁగల కాగితములకట్ట సంగతినిఁ బ్రస్తావించితిని.

ఆ యధికారి నన్ను డాక్టరు లివసి యింటికిఁ దీసికొని పోయెను. అట నాతఁడు లేడు. అందువలన జమీందారు ట్రెలాని యింటికిఁ బోతిమి. లివసి నచటఁ గలసికొంటిమి. అధికారి తనకుఁ దెలిసిన విషయమును జెప్పెను. నేను నాకుఁ దెలిసిన విషయమును జెప్పితిని.

కాగితముల కట్టను విప్పితిమి. అందొక పుస్తకమును, నొక పటమును నుండెను. పుస్తక మంత ముఖ్యమైనదిగాఁ దోఁచలేదు. ఏలయన నది యేదో పద్దుపుస్తకమువలె నుండెను.

కాని పటము ముఖ్యమైనదిగా నుండెను. పటమున నొక దీవి యక్షాంశ, రేఖాంశములతో గుర్తింపబడి యుండెను. ఆ దీవి మధ్య 'దూరదర్శినికొండ' గుర్తింపఁబడి యుండెను. ఆ దీవిలో నెక్కడ యోడలను సురక్షితముగ లంగరు వేయవచ్చునో కూడఁ దెలుపఁబడియుండెను. పటమున మూఁడు ఎఱ్ఱసిరా గుర్తులు గూడ నుండెను. అందొకదాని ప్రక్క "నిధి యిచటఁ గలదు" అని వ్రాయఁబడియుండెను. పటమునకు వెనుకవైపున మఱికొన్ని వివరము లుండెను.

మే మందఱమును నా బంగారు దీవికిఁ బయనము గావింప సమకట్టితిమి. ట్రెలాని యొక నావను, నావికులను సిద్ధపరచుటకు బ్రిస్టలునగరమునకుఁ బోయెను.

తరువాత ట్రెలానివద్దనుండి యొక యుత్తరమువచ్చెను. 'హిస్పానియోలా'అను నావను సిద్ధముచేసితిననియు, దానికిఁ గావలసిన నావికులను లాంగ్ జాన్ సిల్వారు అను నొంటికాలు వంటవాని సాహాయ్యమున సమకూర్చితిననియు నాతఁడు వ్రాసెను. సిల్వారు శక్తిసామర్థ్యములను, సముద్ర ప్రయాణములం దాతనికిఁ గల యనుభవమును ట్రెలాని యెంతయుఁ బ్రశంసించెను.

ట్రెలాని సేవకుఁడగు రెడ్రూతు, నేను బ్రిస్టలునగరమును జేరితిమి. డాక్టరు లివసిగూడ నటకువచ్చెను. ట్రెలాని నా కొక యుత్తరమునిచ్చి 'దూరదర్శిని'యను పూఁటకూళ్ళ యింటిని నడుపుచున్న సిల్వారు కడకుఁ బంపెను.

నేను బూటుహూళ్ళయింటఁ బ్రవేశించి యొంటికాలి వాఁడగు సిల్వారును గలసికొని యుత్తరము నిచ్చితిని. అంతలో నాకిదివఱకుఁ దెలిసిన యొక మనుజుఁడు వీధి ద్వారముకడ కేఁగుచుండుటను జూచితిని. అతఁ డెవరో కాదు. వృద్ధనావికుని కడకు వచ్చిన నల్లకుక్క! "అవును. అతఁడే నల్లకుక్క" అని సిల్వారుతో నంటిని.

"ఎవరైననేమి? నాకు డబ్బులీయకుండ పోయినాఁడు" అని సిల్వారు పలికి వెనుక నెవరినో పంపించెను. నల్లకుక్కను గూర్చి నాకుఁ దెలిసిన విషయమంతయు సిల్వారుకుఁ జెప్పితిని. నా సూక్ష్మబుద్ధి నాతఁ డెంతయుఁ బ్రశంసించెను.

ప్రయాణపు దిన మేతెంచెను. నావను నడుపు ప్రధానోద్యోగిగాఁ గెప్టెను స్మాలెటు అను నాతఁడు నియమింపఁ బడెను. అతఁడు కోపివలె నుండెను. అతఁడనిన జమీందారు ట్రెలానికంతగా నిష్టము లేకుండెను.

అతఁడు ట్రెలానినిఁ గలసికొనవచ్చెను. "విశేషము లేమి? అంతయు సరిగానున్నదా?" యని ట్రెలాని ప్రశ్నించెను.

"నేను విస్పష్టముగాఁ జెప్పుచున్నాను. నాకీ ప్రయాణము నచ్చలేదు. నావికులు నచ్చలేదు" అని స్మాలెటు జవాబిచ్చెను.

"ఓడ, దానియజమానికూడ మీకు నచ్చలేదేమో?" యని ట్రెలాని కోపముతోఁ బల్కెను.

అంతలో డాక్టరు లివసి కలుగఁజేసికొని యిట్లనెను. "కెప్టెన్, మీకుఁగల యభ్యంతరము లేవి?"

అంత కెప్టెను ఇట్లనెను. "ఈ ప్రయాణమును గూర్చిన విషయము లేవియుఁ జెప్పనని ట్రెలానీ నన్నుద్యోగమునకుఁ గుదుర్చుకొన్నారు. కాని ఈ విషయములన్నియు నాకుఁ దక్క మిగతవారి కందఱకుఁ దెలిసినవి. ఇది మిగుల నన్యాయము. మనము గుప్తధనము కొఱకుఁ బ్రయాణము చేయుచున్నామని నాకుఁ దెలియవచ్చినది. రహస్య ప్రయాణమని చెప్పి, రహస్యమును బ్రతియొక్కనికిఁ దెలుపుట మిగులనపాయకరము. నా క్రిందియుద్యోగులను నేనే నియమించి యుండవలసినది."

తరువాతఁ గెప్టెను సూచన ప్రకారము మందుగుండు సామాను, ఆయుధములు సురక్షితమగు ప్రదేశమునఁ జేర్పఁబడెను. ఇంకను గొన్ని రక్షణపు టేర్పాట్లు గావింపఁ బడెను. ఇవి సిల్వరున కేమాత్రమును నచ్చలేదు. నన్ను సిల్వరునకు సాహాయ్యము చేయవలసినదని కెప్టెను హెచ్చరించెను. కెప్టెను అనిన నాకు ద్వేషభావము కలిగెను. కెప్టెను మాటలనుబట్టి, బంగారు దీవిరహస్యములు మాకుఁగాక మఱియింకఁ గొందఱకుఁ దెలియునని గ్రహించితిని.

# 3

సముద్రముపై బంగారు దీవికిఁ బయనము సాగించితిమి. ప్రయాణము మిగుల సౌఖ్యముగనుండెను.

ఒకనాఁడు కెప్టెను తరువాత యధికారియగు ఆరో మాయమయ్యెను. కాని మేమంతగా విచారింపలేదు. ఏలయన నాతఁడు మిగుల నసమర్థుఁడు. ఎప్పుడును త్రాగుచుండెడి

వాఁడు. అతఁడెక్కువగాఁ ద్రాగి సముద్రములోనికి దొర్లి యుండును. అతని స్థానమున ఆండర్సన్ అనువాఁడు నియమింపఁబడెను. ఆండర్సన్ స్థానమున ఇజ్రాయెల్ హాంక్స్ అనువాఁడు నియమింపఁబడెను.

సిల్వరు చాల విచిత్రమైన వ్యక్తి. చాలమంది నావికు లాతని యాజ్ఞలను శిరసావహించుచుండిరి. ఆతఁడు సర్వమును దెలిసినవానివలె నుండెను. అతఁడు తన పూర్వానుభవము లనుగూర్చి, తనవద్దఁగల చిలుకనుగూర్చి విశేషముగా జెప్పుచుండెడివాఁడు.

ట్రెలాని, కెప్టెనులమధ్య సంబంధ మెప్పటివలెనే యుండెను. ఒకరి కొకరు స్నేహితులు కాలేదు.

ఓడమధ్యభాగమున నొక యాపిలుపండ్ల పీపాయుండెను. ఎవరికిఁ గావలసిన పండ్లను వారు దీసికొన వచ్చును. అది కెప్టెనుకు నచ్చలేదు. కాని యాపీపాయే మమ్ముల నందఱను రక్షించెను.

మాయోడ బంగారు దీవిని సమీపించు చుండెను. ఒకనాఁడు నేను 'ఆపిలు' పండ్లను దీసికొను నభిప్రాయముతోఁ బీపాలోనికి దిగితిని. అందుఁ బండ్లులేవు. నాకు హఠాత్తుగా నిదురవచ్చెను. నేను దిరిగి లేచుసరికిఁ బీపావద్ద నెవరో మాటాడు కొనుచుండిరి. లాంగ్‌జాన్ సిల్వరు గొంతు నాకు వినఁబడెను.

"నేను ఫ్లింట్ ఓడలోఁ బనిచేసితిని. చాల ధనము సంపాదించి నిలువయుంచితిని. ప్యూ అను గ్రుడ్డివాఁడు గూడ

నా సహచరుఁడే. సముద్ర ప్రయాణములలో నొక కాలును బోఁగొట్టుకొంటిని. జాగ్రత్త వహించినచో సముద్రపు దొంగ తనములవలన గొప్పైన ధనమును సంపాదించవచ్చును. నిన్ను నేను గొప్ప ధనికునిగాఁ జేయగలను" అని సిల్వరు పలికెను. సిల్వరుతో మాటాడుచున్నది డిక్ అనువాఁడు.

"నీ వగ్నిలో దూకుమనినను దూకెదను. నేను నీ యాజ్ఞలను శిరసావహింతును" అని డిక్ చెప్పెను.

అంతలో నిజ్రాయెల్ హాండ్స్ మాటలు వినబడెను. "మన మింకెంతకాలము వేచియుండుట? కెప్టెనుస్మాలెటు అనిన నాకు మిగులఁ గోపముగానున్నది. వారనుభవించు సౌకర్యము లన్నియు ననుభవింపవలెనని యున్నది" అని యతఁ డనెను.

"సమయమువచ్చువరకు మనము వేచియుండవలయును. సమర్థుఁడగు కెప్టెను మన యోడను సురక్షితముగ నడుపఁ గలఁడు ట్రెలానివద్దఁ బటమున్నది. లివసి మందులనిచ్చును. కనుక నోడ బంగారుదీవినిఁ జేరి, నిధితోఁ దిరిగి వచ్చుచున్నప్పుడు మన ప్రతాపమును జూపవలయును." అని సిల్వరు వారించెను. మఱియు నాతఁ డిట్లనెను. "మన ప్రతికక్షుల నందఱను జంపి సముద్రములోఁ బారవేయవలెను. ట్రెలానినిఁ జంపుట నా వంతు."

తరువాత వారందఱును రమ్ము పానీయమును ద్రాగఁ జొచ్చిరి. అప్పుడు వారి సంభాషణవలన, నావికులలోఁ గొందఱు వారివలలోఁ బడరను విషయమును దెలిసికొంటిని.

అంతలో 'నేల, నేల'యను కేకలు వినవచ్చెను. అది విని యెక్కడివా రక్కడఁ జేరి చెదరిరి. ఒక మహారహస్యమును దెలిసికొనిన వీరునివలెఁ బీపాలోనుండి బయటకు వచ్చితిని. బంగారుదీవి యల్లంత దూరమునఁ గాన్పించుచుండెను.

"కనఁబడుచున్న ప్రదేశము నిదివఱ కెవరైనఁజూచిరా!" యని కెప్టెను ప్రశ్నించెను.

"నేను జూచితిని. ఒకప్పు డొక వ్యాపారస్థునితో నటకుఁ బోతిని. దక్షిణమున నున్న దీవిని 'ఎముకలదీవి' యందురు. అది యోడదొంగలకు నిలయము. అందుఁగల ముఖ్యమైన కొండపేరు దూరదర్శిని" అని సిల్వరు చెప్పెను.

తరువాత వారిరువురును కెప్టెనువద్దఁగల నొక పటమును బరిశీలించిరి. అది ట్రెలాని వద్దఁగల పటమునకుఁ బ్రతి మాత్రమే. అందు నిక్షిప్తరాగుర్తులు లేకుండెను. సిల్వ రా విషయమును గ్రహించెను. సిల్వరు తేనెపూసిన కత్తియని గ్రహించితిని. వాని చతురత కెంతయు నాశ్చర్యపడితిని.

సిల్వరు నా దగ్గఱకు వచ్చి ప్రేమతోఁ బలుకరించి, మృదువుగ నిమిరి యెటకో పోయెను.

నాకుఁ దెలిసిన రహస్యవిషయమును ట్రెలాని మున్నగు వారికిఁ దెలియఁజేయుట కాత్రము చెందుచుంటిని. కాని వీలు పడకుండెను. ఓడ పైభాగమున ట్రెలాని, లివసి, కెప్టెనులు మాటాడుకొనుచుండిరి. కాని యందఱును దిరుగుచోటగుటచే రహస్యమును జెప్ప వీలుపడదాయెను.

అంతలో నదృష్టవశమున డాక్టరు లివసి నన్నేదో పనిపైఁ బిలిచెను. అపు డాతనితో నిటులఁ జెప్పితిని. "మీ ముప్వురితో మాత్రమే యొక రహస్యవిషయమును మాటాడవలయును.' ఆ సంగతిని లివసి ట్రెలాని, కెప్టెనులకుఁ దెలియఁ జేసెను.

ఏదోయొక వంకపై ట్రెలాని, లివసి, కెప్టెనులు ఓడలోని యొక గదిలోనికి వచ్చిరి. కొంతసేపటికి నేనుగూడ నటకుఁ బోతిని. మిగతవారందఱును నోడ పైభాగమున రమ్ము పానీయమును ద్రాగుచుండిరి.

ముప్వురకు నాకుఁ దెలిసిన విషయమంతయుఁ జెప్పితిని. వారు ముప్వురును సావధానమనస్కులై నేఁ జెప్పినదెల్ల వినిరి.

అంత ట్రెలాని యిట్లనెను. "కెప్టెన్, నేను వట్టిమొద్దును. నిన్నేమేమో యనినాను. ఇఁకనుండి నీ యాజ్ఞలను శిరసావహింతును."

"నేను మాత్రము!"అని కెప్టెను అనెను.

"ఇదంతయు సిల్వరు చాతుర్యము"అని లివసి వ్యాకుచ్చెను. "మనము పయనమును సాగించుచునే యుండవలెను. నిధి దొరకువఱకు మనకుఁ గాలమున్నది. అంతదనుక మనలను వారేమియుఁ జేయరు. మనకు విశ్వాసపాత్రులగు మనుజులు కొందఱు గలరుకదా. మన శత్రువులనుకొనిన సమయమున మనము వారిపై దెబ్బతీయవలయును"అని కెప్టెను తెలిపెను.

తరువాత వారు తమకు విశ్వాసపాత్రులగువారిని లెక్కింపఁ దొడఁగిరి. మొత్తమందఱము ఏడుగురమైతిమి.

ఇంకను గొందఱు మాకు సాహాయ్యమును జేయవచ్చునని తలంచితిమి.

"మనమందఱము జాగరూకులమై యుండవలెను. సమయము చూచి ప్రతికక్షుల నోడింపవలయును" అని కెప్టెను పలికెను.

అంత డాక్టరు లివసి యిట్లనెను. "హాకిన్సు మనకందఱకు నమితమగు సాహాయ్యమును జేయఁగలఁడు. ఏలయన శత్రుపక్షములోని వారందఱును నాతనితోఁ జనవుగ నుందురు. వారి చర్యల నాతఁడు కనిపెట్టుచుండును." ట్రెలానికూడ నన్నుఁ బ్రశంసించుచుఁ బలికెను.

భవిష్యత్తు ఎట్లుండునో! ఏడుగురము కలసి పందొమ్మిదిమంది నెదుర్చుట యెట్లు? అను సంశయము నన్ను బాధింపుచుండెను.

# 4

మఱునాఁటి యుదయమున నావలోని వార మందఱమును దీవిని స్పష్టముగాఁ జూడఁగలిగితిమి. అంతయు నడవి. కొండల పైనమాత్రమే, మచ్చునకైన నొక పచ్చని మొక్క కానిపింపకుండెను.

నావ తీరమును జేరుకొలది యటునిటు కొట్టుకొనుట యెక్కువాయెను. నాకుఁ గడుపులో నేదో బాధయనిపించెను. ఏదేని వస్తువును బట్టుకొని నిలువఁ బ్రొక్కుకొనుచుంటిని.

సిల్వారుకుఁ దీనివిషయములన్నియుఁ దెలియును. కావున నాతని యాజమాన్యమునఁ బటములోఁ జూపఁబడిన ప్రదేశమున నోడకు లంగరు వేయఁబడెను. ఆ ప్రదేశ మొక సన్నని కాలువవలె నుండెను. నీటి యంచువఱకుఁ బచ్చనివృక్షములు వ్యాపించియుండెను. మురుగుడు వాసన వేయుచుండెను.

ఓడలోని మనుజులు గుసగుసలు సాగించిరి. వారి యిచ్చవచ్చినటులఁ బ్రవర్తింపసాగిరి. తిరుగుబా టెప్పుడు చేయుదమా యని వా రువ్విళ్ళూరు చున్నట్లుండెను. ఈ విషయమును మా మిత్రులమందఱము గ్రహించితిమి. తా మను కొన్న సమయమునకంటె ముందుగాఁ దిరుగుబాటు జరిగినచో నంతయు విఫలమగునని సిల్వారు భయపడుచుండెను అందు వలన నాతఁడు తనయనుచరులను శాంతింపఁజేయుటకుఁ బ్రయత్నించుచుండెను. మాతోఁగూడఁ గలసికట్టుగాఁ దిరుగుచుండెను.

కెప్టెను స్మాలెటు ఆజ్ఞలను దిరస్కరించుటకు శత్రు పక్షమువారు సిద్ధముగా నుండిరి. అందువలన మే మందఱము నాలోచించుకొనిన తరువాత నోడలోనివారు ద్వీపములోనికిఁ బోవచ్చునని స్మాలెటు అనుమతి యొసంగెను. శత్రుపక్షము వారందఱును బోయినచోఁ దన యిచ్చవచ్చిన యేర్పాటులను జేసికొనవచ్చునని యాతఁడుతలఁచెను. కాని సిల్వారు అనుచరు లాఱుగురు నావలోనేయుండిరి. మా కనుకూలురైన వారందఱకుఁ దుపాకుల నిచ్చితిమి

పదముగ్గురు ద్వీపములోనికిఁ బోవుటకు నిశ్చయింపఁబడెను. చివరిక్షణములో నేనుగూడఁ బోవుటకు నిశ్చయించితిని.

నేల తగులఁగానే యొక్కఁడ యుదుటున దూకి సిల్వరు అఱచుచున్నను వినక చెట్లలోఁ గలసిపోతిని. అచటి ప్రకృతి సౌందర్యము ననుభవింపసాగితిని. నా పని నే మఱచితిని. అంతలో నొకచో నిరువురు మనుజులు మాటాడుచున్న సవ్వడి యాయెను. నేను దగ్గఱకుఁ బోయి చూచితిని. వారు సిల్వరు, టామ్ మా నావికులే.

టామ్‌ను గుఱ్ఱటదారులలోఁ జేరవలసినదని సిల్వరు బోధించుచుండెను. తానేమో మంచివాఁడయినట్లును, విధిలేక కుఱ్ఱటదారులలోఁ జేరినట్లును సిల్వరు చెప్పుచుండెను. కుఱ్ఱటదారులలోఁ జేరుటకు టామ్ నిరాకరించెను. అంతలో నొకచో బాధాపూరితమగు నఱపు వినఁబడెను.

"ఏమది" అని టామ్ ప్రశ్నించెను.

"ఏమున్నది? ఎలెన్ అనుకొందును. తమతోఁ గలియ నందుల కాతనిని గుఱ్ఱటదారులు చంపియుందురు" అని యెట్టి చలనము లేక సిల్వరు బదులిడెను.

"అతఁడు గొప్పవీరుఁడు. చంపిన నన్నుఁగూడఁజంపుఁడు. నేను మీ దుర్మార్గమునకుఁ జేయూత నొసంగఁజాలను" అని టామ్ పలికి పరుగెత్తుచుఁ బోయెను. సిల్వరు తనయూతకఱ్ఱను వానిపైకి శక్తికొలఁది విసరెను. అది తగిలి టామ్ నేలపైఁబడెను. సిల్వరు వానిని సమీపించి కత్తితోఁ బొడిచెను. ఈ ఘోరదృశ్యమును నేను భరింపఁజాలకపోతిని.

సిల్వరు పలుమార్లు ఈలవైచెను. అతని యనుచరులందఱు నచట కేఁగుదెంచిరి. వారందఱు నన్నేమి చేయుదురోయను భయ మావహించెను. సర్వమును మఱచి పరుగెత్తసాగితిని. అంతలో నొక యాకారము చెట్టువెనుక దుముకుచుండుటను గమనించితిని. వెంటనే యాగితిని. ఒక్కపరి యఱవఁదలఁచితిని. కాని సిల్వరు భయమువలన నట్లు చేయలేదు.

అంతలో నొక మనుజుఁడు వచ్చి నా ముందు మోకరిల్లెను. "ఎవరు నీవు?" అని ప్రశ్నించితిని.

"నా పేరు బెన్‌గన్. నేను మనుజులతో మాటాడి మూఁడు సంవత్సరములైనది." ఆ స్వరము పాతాళమునుండి వచ్చుచున్నట్లుండెను. అతఁ డింకను నిట్లనెను. "నీ పేరేమి?"

"జిమ్‌హాకిన్సు" అని సమాధాన మిచ్చితిని. నేను వచ్చినది ఫ్లింటునావ కాదనియు, నాతని యనుచరులు మాత్రము కొందఱు గలరనియుఁ జెప్పితిని.

"మీ నావలో సిల్వరు కలఁడా?" అని యతఁడు ప్రశ్నించెను.

"ఉన్నాఁడు"

"నా ప్రాణములు నాకు దక్కవన్నమాట."

అప్పుడు నేను మా కథనంతయు సవిస్తరముగ నాతనికిఁ దెలిపితిని. అతఁ డదియంతయు విని నన్నుఁ దన స్నేహితునిగా భావించెను. ట్రెలానితోఁ జెప్పి తనకు సాహాయ్యమును జేయింపవలసినదని కోరెను.

ఆతఁడింకను నిట్లనెను. "నేను ఫ్లింటుతోఁ గలసి పనిచేసితిని. ఆతఁడిక్కడ నిధిని బాతిపెట్టుట నెఱుఁగుదును. అందువలనఁ గొందరు నావికులతోఁ గలసి దానిని వెదకుటకై యీ దీవికి వచ్చితిని. నిధి కనఁబడనందున వారు నన్నీ దీవిలో విడిచి పోయిరి. ఇది జరిగి మూఁడు సంవత్సరములైనది. అప్పటినుండి నేనిట్లో, జీవించుచున్నాను. ఇప్పుడు నిధిని గనుగొనుటలో మీకు సాహాయ్యమును జేయఁగలను. మీరిప్పుడు తిరిగి పోవుటకు నావద్ద నొక పడవ గలదు. అదిగో."

అంతలో ఫిరంగిమ్రోఁత వినఁబడెను. తిరుగుబాటు ప్రారంభమైనదని తలంచితిని. మేమిరువురమును బరుగెత్తసాగితిమి. తుపాకులు ప్రేలిన చప్పుడు వినఁబడుచునే యుండెను. అంతలో నెదుట నొకపావుమైలు దూరములో మా మిత్రుల జెండా కనఁబడెను. దానినిఁ జూడఁగనే నాహృదయము కుదుటబడెను.

## 5

నేను నావవద్ద లేనిసమయమున జరిగిన విషయమును డాక్టరు లివసి యిట్లు చెప్పెను.

నేను, కెప్టెను, ట్రెలాని కలసి యాలోచించుకొంటిమి. ఓడలోనున్న శత్రువు లార్గురను బంధించి వెనుకకుఁ దిరిగి పోవుదమనుకొంటిమి. కాని గాలిపాటు బాగుండలేదు. జిమ్ హాకిన్సుగూడఁ దీరమునకుఁ బోయెనని తెలిసెను. అందువలన నేమి చేయుటకును దోఁచకుండెను.

జిమ్‌హాకిన్సునకేట్టి యపాయము వాటిల్లునోయని మేము భయపడితిమి. నేను, హంటరు ఒక పడవపైఁ దీరమునకు బయలుదేరితిమి. హంటరును బడవకుఁ గాపుంచి నేను లోనికిఁ బోతిని. • అచట మట్టికోట కాన్పించెను. అందు దృఢమగు నొక యిల్లు, దిబ్బలు, నీటిబుగ్గ ఖాళీస్థలము మున్నగు వస్తు లన్నియు నుండెను. మట్టికోటలోపల సురక్షితముగనుండి శత్రువులపై యుద్ధము చేయవచ్చునని తలంచితిని. అంతలో నొక యార్తనాదము వినఁబడెను. జిమ్‌హాకిన్సు హత్య చేయఁబడినాఁడని తలంచితిని.

వెంటనే పడవ వద్దకు వచ్చి, యచ్చటనుండి నావను జేరితిమి. నావలోని మామిత్రులు దీవిలోని యార్తనాదము విని భయపడిరి. నేనో, హంటరో మరణించియుందుమని వారు భావించిరి. నేను ద్వీపములోని మట్టికోట సంగతిని వారికిఁ జెప్పితిని. ఆహారపదార్థములను, ఆయుధ సామగ్రిని మట్టి కోటకుఁ బడవలలోఁ జేర్ప నిశ్చయించితిమి. శత్రుపక్షములోని వారిని జాగ్రత్తగా మెలఁగవలసినదని హెచ్చరించితిమి.

రెండుసార్లు పడవపై మట్టికోటకు సామగ్రినిఁ జేర్చితిమి. అచటఁ గాపుదలగా హంటరు, జోయిసులను బెట్టితిమి. మూఁడవసారి పడవలోఁ గొలఁది సామగ్రిని మాత్రమే జేర్చితిమి. పడవలోనికి నేను, ట్రెలాని, రెడ్రూత్, కెప్టెను, శత్రుపక్షములోని వాఁ డనుకున్న అబ్రహాంగ్రే ఎక్కితిమి.

పయనము సాగించితిమి. తీరము జేరుట మిగులఁ గష్టముగనుండెను. సముద్రపు పోటు తీవ్రముగానుండెను

అలల నీరు పడవలోనికిఁ బ్రవేశించుచుండెను. మేమందఱ మును మా సర్వ శక్తులను వినియోగించి పడవను సురక్షిత ముగఁ దీరమునకుఁ జేర్ప నిశ్చయించితిమి. అంతలో మాకొక క్రొత్తయపాయ మెదురాయెను.

ఉన్నట్లుండి కెప్టెను 'ఫిరంగి' అని యఱచెను. వెనుదిరిగి చూచితిమి. ఓడలోని యైదుగురును నందలి ఫిరంగిని మా పడవదిక్కునకుఁ ద్రిప్పుచుండిరి. పొరపాటున ఫిరంగికిఁ గావలసిన మందుగుండుసామగ్రిని నోడలోనే వదలివచ్చితిమి.

"ఇస్రాయెల్ హాండ్సు ఫిరంగినిఁ బ్రేల్చుటలో మిగుల నిపుణుఁడు" అని అబ్రహాంగ్రే యనెను.

కెప్టెను కోరికపై ట్రెలాని, హాండ్సును గుఱిచూచి తుపాకినిఁ బ్రేల్చెను. హాండ్సు సమయమునకు వంగుటచేఁ దుపాకిగుండు మఱియొకనికిఁ దగిలి యాతఁడు నేలకొరగెను.

అంతలో దీవిలోని సిల్వరు అనుచరులు పడవలపైఁ బ్రత్యక్షమైరి. వారు మా పడవను వెంబడించుటకుఁ బ్రయత్నించుచుండిరి. కాని వారినిఁ దప్పించుకొనఁగలమను ధైర్యము మాకుండెను. ఫిరంగినిఁ గూర్చి మాత్రమే మేము భయపడు చుంటిమి. ట్రెలాని మగలఁ దుపాకిఁ బ్రేల్చెను. ఆ యదుటు నకుఁ బడవ నీటమునిఁగెను. అందలి సామగ్రియంతయు నష్ట మాయెను. మే మీఁదుకొనుచు నొడ్డును జేరితిమి. దేవునిపై భారమునువైచి మట్టికోట దిశకుఁ బోసాగితిమి. అంతలో శత్రువులు మా కెదురైరి. వారిపై మేము కాల్పులు సాగించితిమి. మట్టికోటలోనుండి మా మిత్రులుగూడఁ గాల్పులు

సాగించిరి. శత్రువొకఁడు మాత్రము మరణించెను. మిగిలిన వారు పలాయనము చిత్తగించిరి.

మట్టికోటవైపునకుఁ బోసాగితిమి. పొదలమాటునుండి యొక తుపాకిగుండు వచ్చి రెడ్రూతుకుఁ దగిలెను. మేమును దుపాకులు ప్రేల్చితిమి. రెడ్రూతునుమోసికొని మట్టికోటలోఁ బ్రవేశించితిమి.

రెడ్రూతు పరిస్థితి విషాదకరముగ నుండెను. మేమందఱమును విచారించితిమి. కెప్టెను కోటపై మా జెండా నెగురవైచెను. బైబిలులోని ప్రార్థనలను జదువుచుంటిమి. మమ్ము విషాదసాగరమున ముంచిరెడ్రూతు ఈ లోకమును వీడిపోయెను. ట్రెలాని మిగుల దుఃఖించెను. కెప్టె నాతని నూరడించి, శవముపై జెండా నొకదానినిఁ గప్పెను.

ఓడనుండి శత్రువులు ఫీరంగినిఁ బ్రేల్చుచునేయుండిరి. వారికి మట్టికోట కనఁబడుట యసంభవము. వారు జెండాను గుఱిచూచి ఫిరంగినిఁ బ్రేల్చుచుండనోపు. కాని జెండాగూడఁ జెక్కు చెదరలేదు. శత్రువులను దిరస్కరించుచు, విజయపతాక మెగురుచునేయుండెను. మా కేట్టియపాయము గలుగకుండెను. కొన్ని గుండ్లువచ్చి ఖాళీయావరణలోఁబడుచుండెను. అంతలోఁ జీఁకటిపడెను.

కెప్టెను స్మాలెటు తన దినచర్య పుస్తకములో నిట్లు వ్రాసికొనెను.

"అలెగ్జాండరు స్మాలెటు-ఓడకెప్టెను; డేవిడ్ లివసి-ఓడడాక్టరు; అబ్రహాంగ్రే-సాధారణోద్యోగి; జాన్ ట్రెలాని-

ఓడయజమాని, జాన్ హంటరు రిచర్డు; జోయిసు-యజమాని స్వంతసేవకులు. వీరు ఈ రోజునఁ బదిరోజులకు సరిపడిన యాహారపదార్థములతో బంగారుదీవినిఁ బ్రవేశించిరి. థామస్ రెడ్రూతు (యజమాని సేవకుఁడు) తిరుగుబాటుదారుల చేతిలో మరణించెను. జిమ్‌హాకిన్సు... ... ..."

అంతలో మాకుఁ గొన్ని పరిచితమైన కేకలు వినఁబడెను. ఎవరాయని చూచితిమి. ఇంకెవ్వరున్నారు? జిమ్ హాకిన్సు! అతనిని జూచుట మాకెంతయు నానందదాయకముగ నుండెను.

ఇక ముందువిషయమును జిమ్‌హాకిన్సే చెప్పును.

## 6

నేను, బెన్‌గన్ మా జెండాను జూచితిమని యిదివరకుఁ జెప్పితిని. నా స్నేహితులవద్దకు రావలసినదని బెన్‌ను గోరితిని. కాని వారియభిప్రాయమును దెలిసికొనకముందే వారినిఁ గలసికొనుట కాతఁడు నిరాకరించెను. అవసరమైనచోఁ దనను నేను మొదటఁ గలసికొనినచోటఁ గలసికొనవచ్చునని చెప్పి యాతఁడు వెడలిపోయెను.

అంతలో ఫిరంగిగుండ్ల శబ్దము విననయ్యెను. నేను భయపడి పరుగెత్తితిని. గంటసేపటివఱకు ఫిరంగిశబ్దము వినఁబడుచునేయుండెను. చీకటిపడెను. ఫిరంగిశబ్ద మాగిపోయెను.

ఇఁక నాకెట్టి యపాయమును లేదని నిశ్చయించుకొని నా మిత్రులున్నచోటికి నడువసాగితిని. మట్టికోటనుజేరి లోనికిఁ

బోతిని. మిత్రులను గలసికొంటిని. అప్పుడు నాకు గలిగిన యానందము నేమని వర్ణింపను?

వారందఱకు నా యనుభవములను బూసగ్రుచ్చినట్లు చెప్పితిని. తరువాత రెడ్రూతును సమాధిచేయుటకుఁ దగిన ప్రయత్నములఁ గావించితిమి. కెప్టెను అందఱకును దగినపనుల నప్పగించెను. డాక్టరు లివసి వంటచేయవలసివచ్చెను. అతఁడా పనికిఁ గ్రొత్త. అతఁడు మధ్యమధ్య వచ్చి నాతో మాటాడుచుండెను. లివసి - బెన్‌కు జున్నుముక్కను బహుమతిగాఁ నీయఁదలఁచెను.

రెడ్రూతును సమాధిచేసిన తరువాత భోజనము చేసితిమి. పిమ్మట మా నాయకులు ముష్వురును నొకచోట సమావేశమై ముందు జరుగవలసిన కార్యక్రమమును జర్చించుకొనసాగిరి. సాధ్యమైనంతమంది శత్రువులను హతమార్చుటకు వారు నిశ్చయించుకొనిరి.

నేను మిగుల నలసియుండుటచే నారాత్రి నాకు గాఢమగు నిదురపట్టెను. ఏవో కేకలు వినఁబడుటవలన నిదురనుండి లేచితిని. అప్పటికే యందరును మెలకువగానుండిరి. ఎదుట సిల్వరు ప్రత్యక్షమాయెను. అతనితోఁ బాటొకఁడు తెల్లజెండా పట్టుకొని నిలఁబడియుండెను.

కెప్టెను మేమందర మెచ్చటెచ్చట నుండవలసినది యాజ్ఞలిచ్చిన తరువాత సిల్వరుతో నిట్లనెను· "మీకేమి కావలయును?"

"కెప్టెను సిల్వారు సంధిచేసికొనుటకు వచ్చినాఁడు" అని సిల్వారు బదులు చెప్పెను.

"ఎవఁడా కెప్టెను?" అని స్మాలెటు గద్దించెను.

"నేనే. మీరు ఓడను వదిలిపోయిన తరువాత నావికు లందఱును గలసి నన్నుఁ గెప్టెనుగా నియమించినారు. మమ్ము లను సురక్షితముగఁ జూతుమని మీరు వాగ్దానము చేయవలెను" అని సిల్వారు బదులిడెను.

"మీరు మోసగాండ్రు. మీతో మాకు సంధియా! చెప్పవలసిన విషయమును త్వరితముగాఁ జెప్పుము" అని కెప్టెను స్మాలెటు పలికెను.

సిల్వారు లోనికివచ్చి యిసుకలోఁ గూర్చుండెను. అతని సాహసమునకు మేమందర మాశ్చర్యపడితిమి. సిల్వారు నన్నుఁ బలుకరించెను. మా కెప్టెను ధైర్య సాహసములను, చాతుర్య మును ప్రశంసించెను. చెప్పఁదలఁచుకొన్న విషయమును సూటిగాఁ ద్వరగాఁ జెప్పవలసినదని స్మాలెటు గద్దించెను.

అంత సిల్వారు ఇటులఁ జెప్పెను. "ఫ్లింటునిధి మాకుఁ గావలెను. ఎట్లయినను దానినిఁబొంద మేము నిశ్చయించి నాము. మీదగ్గరనున్న పటమునుగూడ మాకిచ్చివేయవలెను. మీరిటులఁ జేసినచో మిమ్ముల నందఱను రక్షింతును."

"చెప్పవలసినదంతయుఁ జెప్పితివా? ఇంకేమైనను మిగిలి యున్నదా?" అని స్మాలెటు ప్రశ్నించెను.

"అంతయుఁ జెప్పితిని. మీరు నామాటను వినిన మంచిది. లేనిచో మిమ్ముల నందరను ధ్వంసము చేయఁగలను. జాగ్రత్తగా నాలోచింపుఁడు" అని సిల్వరు హెచ్చరించెను.

అంత స్మాలెటు ఇటులఁ జెప్పెను. "ఇఁక నేఁజెప్పునది వినుము. మీరందరు, ఒక్కొక్కరు ఆయుధములు వదలి వచ్చి నచో, సంకెళ్లు వేసి, యింగ్లాండునకు దీసికొనిపోయి విచారణ జరిపించెదను· మీకందరకు నురిశిక్ష విధింపబడునట్లు చూతును. మీరిందుల కంగీకరింపనిచో మిమ్ముల నందఱ నిచటనే యమ పురి కంపుదును. ఇంతకంటె నేను జెప్పవలసినదేమియు లేదు. త్వరగాఁ బొండు".

స్మాలెటు ఉపన్యాసమును వినుసరికి సిల్వరు ముఖములో మచ్చుకైన రక్తపుచుక్క లేదు. అతఁడిట్టి సమాధానము వచ్చునని తలంచియుండలేదు. ఇసుకలోనుండి లేచుట కూతము నీయవలసినదని మమ్ముఁ గోరెను. కాని మేమెవరము సహా యము చేయలేదు. అతఁడే యతి కష్టముతో లేచి, మమ్ముల నందఱను నాశనము చేయుదుఁనని బెదరించుచుఁ జెట్ల గుబురు లోనికిఁ బోయెను.

త్వరలోనే యుద్ధము ప్రారంభమగునని తలఁచి, యందఱ మందులను సిద్ధముగా నుంటిమి. స్మాలెటు అత్యుత్సాహ ముతోఁ బనిచేయుచుండెను. ఒక గంట గడచెను. అంతలో జోయిసు తుపాకి ప్రేల్చెను సమాధానముగాఁ జెట్లచాటు నుండి తుపాకులు ప్రేల్చబడెను. కోట కుత్తరభాగమును జాగ్ర త్తగా రక్షింపవలెనని నిశ్చయించితిమి. అంతలోఁగొంతమంది

తిరుగుబాటుదారులు మట్టికోటవైపునకు రాసాగిరి. చెట్లచాటు నుండి కొన్ని గుండ్లు వచ్చి డాక్టరు లివసి చేతనున్న తుపాకిని దుత్తునియలు చేసెను.

జమీందారు, అబ్రహాంగ్రే మరల తుపాకులు ప్రేల్చిరి. శత్రువులు ముగ్గురు నేలకొరిగిరి. అందొకఁడు లేచి వెనుకకు బారిపోయెను. మరి నలుగురు శత్రువులు కోట యావరణలోఁ బ్రవేశించిరి. ఒకఁడు హంటరు చేతఁగల తుపాకిని లాగుకొని దాని మడమతో నాతని తలపై గొట్టెను. మరియొకఁడు డాక్టరు లివసిని గత్తితోఁ నెదుర్కొనెను. అదియొక విషమ సమయము.

అందఱును గత్తుల నుపయోగింపవలసినదని కెప్టెను ఆజ్ఞ నొసఁగెను. మేమందఱ మట్లే చేసితిమి. ఒకశత్రువు నన్నుఁ గత్తితోఁ బొడువఁబోయెను. నేను ఇసుకలో సికిదొర్లితిని. నేను లేచునంతలో నబ్రహాంగ్రే నన్నుఁ బొడువనెంచిన శత్రువును గాలునిప్పరి కంపెను. డాక్టరు లివసి తన్నెదుర్కొనిన వానిని గాయపఱిచెను. మఱియొక శత్రువుకూడఁ జంపఁబడెను. ఇటుల విజయము మమ్ముల వరించెను. శత్రువులలో మిగిలిన యొకఁడు కాలికి బుద్ధిచెప్పెను.

ఇఁకమాలో హంటరు స్పృహతప్పియుండెను. జోయిసు తుపాకిగుండుతగిలి మరణించెను. కెప్టెనుకు బలమగు దెబ్బతగిలెను. కాని శత్రుపక్షమువారి కెక్కువనష్టము కలుగుట మాకానందకరముగ నుండెను.

మఱికొందరు శత్రువులు మాపై దండెత్తివత్తురని యెంచితిమి; గాని యటులజరుగలేదు. ఈలోపల డాక్టరు లివసి క్షతగాత్రులకు వైద్యసాహాయ్యము చేసెను. దెబ్బతగిలి పడియున్న శత్రువు గాయమునకుఁ గట్టుకట్టుచుండఁగనే మరణించెను. కెప్టెనుకుఁ దగిన పరిచర్య లొనర్పఁబడెను.

ఈ విధముగా దైవము ఇంతవరకు మా పక్షముననే యుండెను. ఏలయన సర్వనాశనమైనదనుకొనిన మాకు, విజయము లభించెను. శత్రువులను గొందఱను జంపఁగలిగితిమి.

# 7

భోజనములైనవి. తరువాత డాక్టరు లివసి యాయుధ సహితుఁడై బయటకుఁబోయెను. ఆతనివద్ద బంగారుదీవిపటము గూడ నుండెను ఆతఁడటుల నొంటరిగాఁ బోవుటను జూచి యందఱును బలువిధముల నభిప్రాయపడిరి. కాని యాతఁడు బెన్‌గన్‌ను గలసికొనుటకుఁ బోవుచున్నాఁడని నేను గ్రహించితిని.

నాకేమియుఁ దోఁచలేదు. బెన్‌గన్ పడవను జూచుటకు, బోవలెనని నిశ్చయించుకొంటిని. రెండు చిన్నతుపాకులనుఁ బిస్కట్లను సిద్ధముచేసికొంటిని. ఎవరును నన్ను గమనించుచుండని సమయమును జూచి బయటకుఁబోతిని. అప్పటి కాపని పొరపాటుగాఁ గనఁబడినను దరువాత నది మంచిగాఁ బరిణమించెను.

తీరమునుబట్టి ప్రయాణమైపోతిని. ప్రయాణము చేయఁగాఁ జేయగా బెన్‌గన్ పడవ కనఁబడెను. అదియొక చిన్న

పడవ. దానినిఁ జూచుటతో సంతృప్తిఁజెందక, హిస్పానియోలాను జూచుటకుఁబోయితిని. సిల్వరు యొకచిన్నపడవపై, నావనుండి దీవికిఁ బ్రయాణము చేయుచుండుటను గమనించితిని. మమ్ములను ఓడలోనివారు దీవిలో వదలివేసిపోవుదురేమో యను సంశయము నాకుఁ గలిగెను. అందువలన బెన్‌గన్‌పడవపై హిస్పానియోలాకడకుఁ బోయి లంగరుత్రాళ్ళు కోసివేయఁ దలఁచితిని.

చీఁకటిపడువఱకు వేచియుంటిని. అప్పుడు పడవ నెక్కి హిస్పానియోలాను సమీపించితిని. సమయము కనిపెట్టి లంగరుత్రాళ్ళను దెగఁగోసితిని. నావ గిఱ్ఱునఁదిరుగసాగెను. కాని యా విషయమును లోనివారెవ్వరును గమనించినట్లు లేదు. ఓడనుండి నీటిలోనికి వ్రేలాడుచున్న యొక చిన్న త్రాటిసాహాయ్యమున నోడపై కెక్కితిని.

ఓడలో నిద్రజాయెల్ హాండ్సు, మఱియొకఁడు మిక్కుట ముగఁ ద్రాగి యొడలు తెలియని పరిస్థితిలోఁ బోరుచుండిరి. మిగతవారందఱుకూడ దప్పత్రాగి మైమఱచియుండిరి. నే నా స్థితినిఁ జూచి నా పడవలోనికిఁ దిరిగివచ్చితిని.

ఓడ ప్రయాణము చేయుచుండెను. ఓడతోఁబాటు నా పడవగూడ సాగిపోవుచుండెను. కొంతసేపైన తరువాత నోడలోని కొందఱు తమ ప్రమాదస్థితిని గుర్తించిరి. కాని యేమియును జేయఁజాలకైరి. అలల తాకిడికి నా పడవ మునిగిపోవునను భయము నన్నావరించెను. దైవముపై భారమువైచితిని. కొంతసేపగుసరికి నాకుఁ దెలియకుండఁగనే నిదురపట్టెను.

మరల మెలకువ వచ్చుసరికి బాగుగాఁ దెల్లవారెను. ఓడ, నా పడవ యింకను ప్రయాణము చేయుచునే యుండెను. ఓడలో నెట్టి యలజడి యున్నటులఁ దోఁచలేదు. అందువలన నందలి పరిస్థితులఁ దెలిసికొనఁదలఁచి యోడలోనికిబోతిని. అంతయు నిశ్శబ్దముగనుండెను. ఇస్రాయెల్ హాండ్సు మున్నగు వారందఱును స్మృహతప్పి పడియుండిరి. రక్తము చారికలు కట్టియుండెను. సీసాలు పగిలియుండెను. హత్యలు జరిగిన వేమో యను ననుమానము తట్టెను.

అంతలో నిస్రాయెల్ హాండ్సు కదలెను. నే నాతని దగ్గ ఱకుఁబోయి పలుకరించితిని. అతఁడు నీరసముగాఁ దనకు రమ్ము పానీయము కావలెనని చెప్పెను. నేను సామగ్రిగదికిఁబోయి యతని కా పానీయమును దెచ్చియిచ్చితిని. నేనుగూడఁ గొంత యాకలిఁ దీర్చుకొంటిని.

ఓడ నా స్వాధీనముననున్నదనియు, దానికి నేను గెప్టెను ననియు నాతనికిఁ దెలిపితిని. అతఁ డందుల కంగీకరించెను. శత్రువుల నల్లజండాను గ్రిందికిదింపివైచితిని. తరువాత నాతని కోరికపై. నాతనికిఁ గొన్ని తినుబండారములు, మంచినీరు, ఒక గుడ్డముక్క తెచ్చియిచ్చితిని. అతఁడు ఆహార పదార్థములను భుజించి లేచినిలఁబడెను. గాయమునకుఁ గట్టు కట్టుకొనెను. ఇస్రాయెల్ హాండ్సు మిగుల వినయముతో నేను జెప్పినట్లెల్లఁ జేయుచుండెను. అందులకు నేనెంతయు గర్వపడితిని. కాని యాతని ద్వేషమును, బగను నేను గుర్తింపకపోలేదు. జాగ రూకతతోనే మెలఁగుచుంటిని.

ఇస్రాయెల్ హాంస్సు నన్నుఁ గబుర్లలోనికి దింపెను. కాని నా చూపులను దప్పించుకొనుచు మాటాడు చుండెను. ఒక్కపరి మాత్రమాతడు నా వంకఁ జూచి తలను ద్రిప్పుకొనెను. అతని మోసమును నేనప్పుడే గ్రహించితిని. వేఱొక గదిలోనికిఁ బోయి యొక బ్రాందీ సీసాను దెచ్చిపెట్టవలసినదని యాతఁడు నన్నుఁ గోరెను.

నేనా ప్రదేశమునుండి బ్రాందీ సీసాను దెచ్చుటకుఁ బోవుచు నాతఁ డేమిచేయునోయని చాటుననుండి తొంగిచూచితిని. ఈ లోపల నాతఁడు లేచి వేఱొక చోఁ బడియున్న బాకును దీనికొని తనబట్టలలో దాఁచుకొనెను. దానివలన నాతఁ డెప్పటికైన నాకపకార మొనర్చునని గ్రహించితిని. కాని యోడ, రేవును చేరునంతవఱకు నాకెట్టి హానినిఁ దలపెట్టఁడని తలఁచితిని. బ్రాందీ సీసా నొక దానిఁ దెచ్చి యాతని కిచ్చితిని.

ఓడ రేవును సమీపించుచుండెను. ఓడను దీరమున నాపు సంరంభములో మునిఁగియుంటిని. హఠాత్తుగా నోడలు జల్లుమనెను. వెనుదిరిగి చూచితిని. ఇస్రాయెల్ హాంస్సు చేత బాకును బట్టుకొని నాదగ్గరకు వచ్చుచుండెను. మేమిరువురము నొక్కపరి యఱచితిమి. అతఁడు ముందుకు దుమికెను. నేను బ్రక్కకుఁ దప్పుకొంటిని. చిన్న తుపాకిని గుఱిపెట్టితిని. కాని యది పేలలేదు. అంతలో నోడ తీరమునఁగల యిసుక దిబ్బలను కొట్టుకొని కంపించెను. ఇస్రాయెల్ హాంస్సు దొర్లిపడెను. ఈ లోపల నేనొక తెరచాప కొయ్యమీఁది కెక్కితిని.

అతఁడు తనచేతనున్న బాకును విసరెను అది కొయ్యకుఁ దగిలి నేలమీఁదఁ బడెను.

చిన్న తుపాకినిఁ గ్రొత్తమందుతో నింపితిని. జేబులో నున్న మఱియొక దానిఁగూడ మందుతో నింపితిని. రెంటిని నాతని వైపునకు గుఱివెట్టి బెదరించితిని; కాని యాతఁడు మాటాడుచునే బాకును విసరెను. అది నా భుజముపైఁ జర్మమును జీల్చుకొనుచుఁ గొయ్యకుఁ దగిలెను. అదేసమయమున నేనుజిన్నతుపాకినిఁ బ్రేల్చితిని. అతఁడు హాహాకారముచేయుచుఁ గ్రిందఁ గూలెను. అటనుండి యాతఁడు నీటిలోనికి జాఱి శాశ్వత నిద్రను బొందెను.

తరువాత నేను ఓడలోనికి దిగివచ్చి భుజమునకుఁ దగిలిన గాయమునకుఁ గట్టుకట్టుకొంటిని. నా కా గాయము పెద్ద బాధను గలిగించలేదు. అంతలోఁ జీఁకటిపడెను. నా స్నేహితులను గలసికొనవలెనను నాత్రము హెచ్చాయెను. వారు నేను జెప్పకుండఁగాఁ బోయినందులకుఁ గోపించినను నా విజయమునకు నన్నభినందింతురని తలఁచితిని.

ఓడలోనుండి నీటిలోనికి దిగి కొంతదూరము నడచితిని. మట్టికోటను ద్వరగాఁ జేరవలెనను నభిప్రాయముతోఁ బరుగెత్తితిని. నన్ను శత్రువని యనుమానించి, మిత్రులే తుపాకిగుండ్లకెరగావింతురేమోయని చెట్లచాటున నడువసాగితిని.

మట్టికోట యావరణను జేరితిని. అచట నొకపెద్దమంట రగుల్కొనుచుండెను. నే నెవరినోయని పలుకరించువారైనను లేనందులకు చాల నాశ్చర్యము చెందితిని. అందఱును గాఢ

నిదురయందు మునింగియుండిరి. ఎవరికినిఁ దెలియకుండ నా స్థానమునకుఁబోయి నిదురపోవలెనని తలఁచితిని. అంతలో నా కాలొకనికిఁ దగిలెను. కాని యతఁడు లేవలేదు. అంతలోఁ జిలుకయఱపు వినఁబడెను. అది సిల్వరు చిలుక! దాని యఱపున కందఱును లేచిరి. "దీపములు వెలిగింపుఁడు" అని సిల్వరు అఱచెను. నే నమితముగ నాశ్చర్యపడితిని. మిత్రులున్నారని వచ్చిన శత్రువులు ప్రత్యక్షమైరి!

## 8

దీపములు వెలిగించిన తరువాతఁ బరిస్థితియంతయు నా కవగతమాయెను. శత్రువులు మట్టికోట నాక్రమించుకొని యుండిరి. నా మిత్రులెవరును గనఁబడలేదు. వారందఱును జంపఁబడిరేమోయని యనుమానించితిని.

నాతో సిల్వరిట్లనెను, "మీ వారందఱీకోటను వదలి పోయినారు. ఓడకూడ మాయమైనది. నీవనిన నాకుఁ జాల నిష్టము. నిన్ను నేనెల్లప్పుడును ప్రశంసించుచుందును. మా పక్షమునఁ జేరవలసినదని నిన్ను హృదయపూర్వకముగ నాహ్వానించుచున్నాను"

"ఈ పరిస్థితి యెట్లు సంభవించినది?" అని ప్రశ్నించితిని.

"నిన్నమధ్యాహ్నము డాక్టరు లివసి వచ్చి యోడ మాయమైనందున నీ మట్టికోటను, నిందలి సామగ్రిని మాకు వశము గావించెను. నీ మిత్రు లెక్కడ నున్నారో నాకుఁ దెలియదు. ఇంతకంటె నీవు వినఁదగినది లేదు." అని సిల్వరు

జవాబిచ్చెను.

"నన్ను మీరేమియు మోసము చేయఁజాలరు. మిమ్ము లను నే ననేకసార్లోడించినాను. ఆపిలు పండ్ల పీపాలోఁ గూర్చుండి మీ రహస్యముల నన్నింటినిఁ దెలిసికొంటిని. ఓడ నిప్పుడొక సురక్షితస్థానమున నుంచినది నేనే. నన్నుఁ జంపినఁ జంపుఁడు. కాని నన్నువదలివైచిన మీ ప్రాణములను రక్షించు టకుఁ బ్రయత్నించెదను. సిల్వర్! నా మిత్రులకు ద్రోహ మును దలపెట్టలేదనిమాత్రము వారితోఁ జెప్పుము" అని నేనంటిని.

సిల్వరు అనుచరులు నన్నుదే క్షణమునఁ జంపుటకుఁ బ్రయత్నించిరి గాని సిల్వరెప్పటికప్పు డడ్డుపడెను.

"మీరెవరైన నాతోఁ బోరాటమునకు సిద్ధముగా నున్నచో రండు. నా శక్తిసామర్థ్యములను జూపెదను. ఎవరు వచ్చెదరో, కత్తి తీసికొని ముందుకురండు. వారిపనిఁ బట్టెదను. ఒక్కరును రారేమి? అందఱును బిఱికివాండ్రేనా? నన్నుఁ గెప్టెనుగా నెన్నుకొని నా కెదురుతిరిగెదరా? మిమ్ములఁ జూచిన నా కసహ్యము వేయుచున్నది. మీకంటె నీ కుఱ్ఱవాఁడు శతవిధములమేలు. అతనికిఁగల ధైర్యసాహసములు మీ కే కోశమునను లేవు." అని సిల్వరు తన యనుచరులను హెచ్చ రించెను.

సిల్వరు అనుచరులు కొంతతడవు గుసగుసలాడి బయ టకుఁబోయిరి. అంత సిల్వరు నాతనితోనిట్లనెను. "నీవు నన్ను రక్షింపుము, నిన్ను నేను రక్షించెదను." నన్ను వారు తొల

గింపవలె ననుకొనుచున్నారు. కాని; నీకెట్టి యపాయమును రానీయను. ఆ సమయమున సిల్వెరు అనుచరుఁడొకఁడు వచ్చి దీపమును దీసికొనిపోయెను. మేము చీఁకటిలో నుంటిమి.

సిల్వెరు అనుచరులందఱును దిరిగివచ్చిరి. ఒక యనుచరుఁడు సిల్వెరుచేత నేమోయుంచెను.

'నల్లచుక్క' ! నన్నుఁ బదవినుండి తొలఁగించినారా? నే నట్లే యనుకొంటిని. మీ కేమో నియమములు తెలియు ననుకొంటిని. కాని మీకుఁ దెలియవని స్పష్టమగుచున్నది. మీరు నన్నుఁ దొలగించుటకు ముందు నేను జేసిన తప్పులను జెప్పవలదా ?" అని సిల్వెరు గద్దించెను.

"మనవా రనేకులు చనిపోయిరి. కుట్రభగ్నమైనది, శత్రువులను జంపక కోటనుండి పోనిచ్చినావు. తరువాతనైన వారిమీఁదకుఁ బోనిచ్చినావుకాదు. ఇప్పు డీ కుఱ్ఱవానిని జంపనిచ్చుటలేదు. ఇవి నీ తప్పులుకావా ?" అని జార్జి యను ననుచరుఁడు బదులుపలికెను.

అపుడు " సిల్వె రిటులఁ జెప్పెను. నా మాటను మీరు వినియున్నచో మనమీపాటికి బంగారునిధితో నోడపై నింటికిఁ బోవుచునుండియుండెడివారము. కాని మీరు నామాట వినక సరియైన సమయము రాకమున్నే తిరుగుబాటు ప్రారంభించినారు. దాని ఫలిత మనుభవించినారు. ఈ కుఱ్ఱవానిని జంపిన మనకుఁ గలుగు లాభ మేమి ? ఈతఁడు మనకడనున్నచో మన శత్రువులు మనముచెప్పినట్లెల్ల వింటురు. డాక్టరు లివసిమున్నగు వారినిఁ జంపిన లాభ మేమి ? ఆతఁడు మనకు వైద్య సహాయ్య

మును జేయుటలేదా? ఇంకవారిని మట్టికోటనుండి నేల పోని చ్చినాను? ఇదిగో చూడుండు."

సిల్వరు ఒకపటమును వారిముందు పాఱవైచెను. అది నేను వృద్ధనావికుని పెట్టెనుండి సంగ్రహించి డాక్టరు లివసికిచ్చిన బంగారు దీవి పటము! సిల్వరు అనుచరులు దానినిఁజూచి చాల సంతసించిరి. కాని నాకంతయు నగమ్యగోచరముగ నుండెను.

జార్జి అనువానికి సిల్వరుపై ద్వేషముతగ్గక "ఓడ మాట?" యని ప్రశ్నించెను. సిల్వరాతనిని బెదరించి, తన పదవికి రాజీనామా నిచ్చుచున్నా ననెను. అనుచరులందఱును, సిల్వరునే కెప్టెనుగా నుండవలసినదని ప్రతిఘటించుకొనిరి. సిల్వ రందుల కంగీకరించెను. సిల్వరును గూండ్రదోసి కెప్టెను కావ లంచిన జార్జి నిరాశఁ జెందెను.

తరువాత నందఱమును ప్రక్కలఁ జేరితిమి. కాని నాకెంతసేపటికిని నిదురపట్టలేదు. తనయనుచరుల తిరుగుబాటు నణంచివైచిన సిల్వరు చాకచక్యము నన్నాశ్చర్యాంబుధి ముంచివైచెను. ఎప్పుడో నిదురపట్టెను.

తెల్లవాఱెను. అందఱును లేచితిమి. జబ్బుగానున్న వారికి వైద్య సహాయమును జేయుటకు డాక్టరు లివసిగా రేతెంచిరి. సిల్వ రాయనతో నెంతో యాప్యాయముగా మాటాడి నారాకను దెలిపెను.

డాక్టరు లివసి నారాక నంతగాఁ బట్టించుకొనక ఛలోక్తులఁ బల్కుచు జబ్బుగావున్నవారికి మందుల నిచ్చెను. తరు

వాత నాతో మాటాడవలసి యున్నదనియు, నన్ను బయటకుఁ బంపించవలసినదనియు సిల్వారును గోరెను. జార్జి తన యసమ్మతినిఁ దెల్పెను. సిల్వారు జార్జిని దూషించి నన్నుఁ గొనివత్తునని తెల్పెను. మా మిత్రులకుఁ దన వందనములని చెప్పెను.

సిల్వారు అనుచరు లాతనిని దూషించిరి. సిల్వారు తమ్ము మోసగించి, శత్రుపక్షమునఁ జేరజూచుచున్నాఁడని నిందించిరి. సిల్వారు వారిని గద్దించి, నన్ను లివసివద్దకుఁ దీసికొని పోయెను. నేను పారిపోనని నావద్దనుండి వాగ్దానమును దీసికొనెను. తన్ను క్షమించి రక్షింపవలసినదని లివసినిఁ గోరెను. డాక్టరును, నేనును మాటాడుకొనుచుండఁగా దూరముగాఁ బోయెను.

నే నెవరితోఁ జెప్పకుండఁగాఁ బోయినందుకు లివసి నన్ను మందలించెను. నన్ను క్షమింపవలసినదని కోరితిని. వాగ్దానభంగమైనను దనతోఁ బారిపోయి రావలసినదనిగోరెను. మాటలసందర్భమున హిస్పానియోలా నావ నొక సురక్షిత ప్రదేశమునకుఁ జేర్చితినని తెలిపితిని. అంత లివసి యిట్లనెను.

"మేము మొదటినుండి నీచే రక్షింపబడుచున్నాము. శత్రువుల కుట్రను గ్రహించితివి. బెన్‌గన్‌ను మన కనుకూల మొనర్చితివి. లేనిచో నంతయు నిష్ప్రయోజనమై యుండెడిది."

తరువాత లివసి సిల్వారును బిలిచి యిట్లనెను. "నీవు పటసాహాయ్యమున నిధికొఱకు వెదకుట నిష్ప్రయోజనము."

సిల్వ రిట్లనెను. "నిధికొఱకు వెదకుచున్నటుల నటింపనిచో నాకును, హాకిన్సుకును నా యనుచరులవలన నపాయము సంభవించును."

లివసి:- బంగారము బదులు రాళ్ళుకనఁబడిన నాశ్చర్యపడవలదు.

సిల్వరు:- నా కేదియు నర్థమగుటలేదు. ఇందేదో రహస్యమున్నది. అదినాకుఁ జెప్పరా?

లివసి:- అది నీకుఁ దరువాత దెలియును. నీవు మా పక్షమునఁ జేరి హాకిన్సును రక్షించినచో నీ కెవరివలన నెట్టి హానియుఁ గలుగకుండ నేను జూచెదను.

సిల్వరందుల కంగీకరించెను. డాక్టరు లివసి తన దారినిఁ బోయెను. నాకు మాత్రము మా మిత్రులు మట్టికోటను శత్రువుల స్వాధీనముచేసి పటము నెందులకిచ్చిరో యర్థము కాలేదు. సిల్వరు ప్రవర్తన రెండావుల దూడవలెనుండెను. అతఁడు తుదకేమిచేయునో!

# 9

సిల్వరు తన యనుచరుల కందఱకు మిగుల నమ్మకము కలిగించెను. ఒకనాఁడు నిధిని వెదకుటకు మేమందఱము బయలుదేరితిమి. నాకుఁదక్క మిగిలినవారందఱకు నాయుధములు గలవు. నా నడుముచుట్టును నొక త్రాడునుగట్టి సిల్వరు దానినిఁ జేతఁబుచ్చుకొనెను.

మే మటులఁ జాలదూరము తిరిగితిమి. నావికులు నిధినిఁ గనుగొనుటకు మిగుల నాత్రముపడుచుండిరి. అందువలన మా కంటె ముందుగఁ బోసాగిరి. అంతలో నొక కేక వినఁబడెను. మే మచటకుఁ బోతిమి. ఒక యస్థిపంజరమును జూచి యొక నావికుఁడు భయపడి కేకవైచెను. మేమును భయపడితిమి. కొంతతడవైన తరువాత నా యస్థిపంజరము నిధియున్న ప్రదేశమును జూపుచున్నదని నిశ్చయింపఁబడెను.

నావికులందఱును సిల్వరును వెంబడించియే యుండిరి. అందఱును దెయ్యములను గూర్చి మాటాడుకొనుచుండిరి. అంతలో హఠాత్తుగా వికృతస్వరూపముతో నొకపాట వినఁనాయెను. దానిని వినఁగనే నావికుల కెక్కడలేని భయమును గలిగెను. అది ఫ్లింటు స్వరమని యొకనావికుఁడు పలికెను. భయపడవలదని సిల్వరు వారిని హెచ్చరించెను. "దెయ్యముల మాటకుఁ బ్రతిధ్వని యుండదు. ఈ పాటకుఁ బ్రతిధ్వని వినఁబడుచున్నది. కావునఁ బాడుచున్నది మనుజుఁడేగాని దెయ్యము కాదు" అని సిల్వరు సిద్ధాంతీకరించెను.

మఱియు నాతఁ డిట్లనెను. "ఫ్లింటు బ్రతికియుండఁగనే నే నాతనికి భయపడెడివాఁడనుగాను. అతఁడు మరణించిన తరువాత భయపడుటయేల? ఆ స్వరము ఫ్లింటుస్వరమువలెనున్నది గాని ఫ్లింటుస్వరము మాత్రముకాదు. అది నే నిదివఱకు వినిన స్వరమే. ఉండుఁడు; జ్ఞప్తికిఁ దెచ్చుకొనెదను. ఆఁ బెన్‌గన్"

"అవును, బెన్‌గన్"అని యందఱును నఱచిరి. "బెన్‌గన్ బ్రతికియున్నను, జచ్చినను నొకటే. మనకేభయమును

లేదు." అని యొకనావికుఁడనెను. డిక్ అను నావికునకుమాత్ర మింకను భయము వదలలేదు.

తరువాత మేము ముందుకుఁ బోసాగితిమి. నావికులందఱును మిగుల నుత్సాహవంతులై యుండిరి. ఎదుట మూఁడు పెద్దవృక్షములు గాన్పించెను. ఆ వృక్షములు చుట్టుప్రక్కల నున్న వృక్షములకంటె నెత్తుగానుండెను. అందొక వృక్షము వద్ద నిధియుండును. వృక్షములను సమీపించుచున్నకొలఁది సిల్వరు చిత్తవృత్తి మాఱుచుండెను. అతని దృక్కులు విష పూరితములై యుండెను. డాక్టరు లివసి కాతఁడు చేసిన వాగ్దానములను మఱచినటులుండెను. నాకు మరణము తప్పదని నిశ్చయించితిని.

నావికులు ముందుపోయి చెట్లక్రింద బరిశీలించి యొక్కసారి కేకపెట్టిరి. మేము పోయిచూచితిమి. ఏమున్నది! మా ముందొక పెద్ద గొయ్యియున్నది. మాకంటె ముందే యెవరో నిధినిఁ దీసికొనిపోయిరి. ఆ నిధినిఁ ద్రవ్వి చాలాకాలమైనట్లుండెను. ఏలయన లోపలఁ బచ్చిక మొలిచియుండెను. ఆ దృశ్యమును జూడఁగనే నావికులు తెల్లమొగమువైచిరి.

సిల్వరుమాత్రము ధైర్యముగానుండెను. అతఁడు నాకొక చిన్నతుపాకినిచ్చి యపాయము నెదురుకొనుటకు సిద్ధముగా నుండవలసినదని రహస్యముగా హెచ్చరించెను. అతని చూపులలో నాపట్ల నమితమగు ప్రేమ, ప్రీతి కాన్పించెను. మేమిరువురమును నొకప్రక్కను, నావికులందఱును నొక ప్రక్కను నుండిరి.

నావికులందఱును లోనికిదుమికి వెదుకనారంభించిరి. అందఱును దూషింపసాగిరి. ఒక నావికునకు రెండు గినీల నాణెము కనఁబడెను. అతఁడు దాని నందఱకు నెత్తి చూపెను. "ఇదేనా నిధి! ఎంతమోసము!" అని యాతఁడఱచెను.

"ఇంకను ద్రవ్యుఁడు. ఇంకేమైనను దొఱకవచ్చును" అని సిల్వరు హెచ్చరించెను.

"చూచితిరా! మనలను సిల్వరు ఎంతమోసము చేసెనో?" యని జార్జి తనకోపమును వెలిపుచ్చెను.

నావికు లందఱును జార్జి పక్షముననేయుండిరి. వారు, తమ్ముఁ సిల్వరు మోసగించెనని తలఁచిరి. అందఱును పైకివచ్చి సిల్వరుపైఁ దమ తీవ్రదృష్టులను బఱపిరి. కాని సిల్వరుచలింప లేదు. అతని ధైర్యసాహసములు నిరుపమానము!

జార్జి యిటులనెను. "మిత్రులారా! చూడుఁడు. మన కెదుట నిరువురు శత్రువులున్నారు. ఒకఁడు కుంటివాఁడు మనల నీ దుస్థితికిఁ దెచ్చినద్రోహి. రెండవవాఁడా కుఱ్ఱవాఁడు. వాని నీ క్షణముననే సంహరించెదను వినుఁడు..."

అంతలోఁ దుపాకి కాల్పులు వినఁబడెను. మూఁడు గుండ్లువచ్చి ముగ్గురు నావికులను నేలపైఁబడఁగొట్టెను. మిగిలిన ముగ్గురు నావికులును బలాయనముచిత్తగించిరి. నేలపైఁ బడినవారిలో జార్జియొకఁడు. సిల్వరాతనినిఁ దన చిన్నతుపాతోఁ గాల్చి చంపివైచెను.

# 10

అంతలో డాక్టరు లివసి, అబ్రహాం గ్రే, బెన్ గన్ అచటఁ బ్రత్యక్షమైరి.

"పారిపోవుచున్న ముగ్గురను బట్టుకొనుఁడు. వారు పడవలను జేరకుండఁజూడవలెను" అని డాక్టరులివసి యఱచెను.

అందఱము పరుగెత్తితిమి. సిల్వరుగూడ మమ్ము వెంబడించెను. ముందు మేము, వెనుక సిల్వరు పరుగెత్తుచుంటిమి. కాని పారిపోవుచున్నవారు పడవలకొఱకుఁ బోవుటలేదు. దిక్కు తెలియకఁ బోవుచుండిరి. ఆ విషయమును మేము గ్రహించి యాగితిమి. సిల్వరు మమ్ముఁ గలసికొనెను.

సిల్వరు డాక్టరును, బెన్ గన్‌ను బలుకరించెను. బెన్ గన్ సిల్వరుతో నాప్యాయముగ మాటాడెను. అతడంతటి యమాయకుఁడు! తరువాత మేమందఱము పడవలదెసకుఁ బయనమైతిమి. అపుడు డాక్టరు లివసి నా కిటులఁజెప్పెను.

"బెన్ గన్ ద్వీపమందు నొంటరిగాఁ దిరుగుచు నస్థిపంజరమును జూచెను. దానినిబట్టి యాతఁడు నిధిగల ప్రదేశమును గనుగొనెను. అచట్రద్రవ్వి యా నిధిని అప్పుడప్పుడు తన కొండ గుహకుఁ జేరవైచెను. ఇటులఁజేయుట కాతనికిఁ జాలకాలము పట్టెను. మనయోడ యిటకింక రెండునెలలకు వచ్చుననఁగా నతఁడు నిధినిఁ బూర్తిగఁజేరవైచెను. ఈ రహస్యమును నేను బెన్ గన్‌నుండి తెలిసికొంటిని. అందువలన ద్వీపపట మవసరము లేదని సిల్వరున కిచ్చివైచితిని.

బెన్‌గన్ గుహలోఁ గావలసినంత యాహారముగలదు. అందువలన మట్టికోటను సిల్వారుకు వశపఱచి నివాసమును గుహకు మార్చితిని.

ఇఁక నీ రోజున సిల్వారు తన యనుచరులతో నిధిని వెదకుటకుఁ బోవునని తెలియవచ్చెను. సిల్వారుతో నీవుగూడ నుందువుగదా! నిధి కనబడుపోవుసరికి శత్రువులు నీకేమైన హానిచేయుదురని తలఁచి నిన్ను రక్షింపనెంచితిని. ట్రెలానిని గుహారక్షణకుంచి నేను, బెన్‌గన్, అబ్రహాంగ్రే నిన్ను రక్షింప బయలుదేఱితిమి. బెన్ ముందుపోయి తన వికృత స్వరముతో శత్రువులను భయపెట్టెను. అది కొంతవరకు మన కుపకారమును జేసెనుగనా! శత్రువులు నిధిస్థలమును జేరుట కాలస్యమైనది. ఈ లోపల నేను, గ్రే వచ్చుటకు వీలుపడినది"

"హాకిన్సువలన నేనుగూడ రక్షింపఁబడితిని."అని సిల్వారు పలికెను.

మేమందఱము పడవలున్నచోటికిఁ బోతిమి. ఒక పడవను నాశనముచేసి, రెండవపడవ నెక్కి హిస్పానియోలాను జేరితిమి. దాని నొక రేవులో నిలిపి అబ్రహాంగ్రేను కాపుంచితిమి. నేను, డాక్టరు లివసి, బెన్‌గన్, సిల్వారు, ట్రెలాని యున్న బెన్‌గన్ గుహకుఁ బోతిమి. ట్రెలాని మాకొఱ కెదురు చూచుచుండెను ఆయన నాతో కరస్పర్శచేసెను; గాని యేమియు మాటాడలేదు. సిల్వారాయన కతివినయముతో నమస్కరించెను. ట్రెలానికి మిగులఁ గోపమువచ్చి యిటులనెను.

"సిల్వరు! నీవు గొప్ప ద్రోహివి. దుర్మార్గుడవు. నిన్ను శిక్షింపవలదని డాక్టరు లివసి కోరుచున్నాఁడు. అందువలన నేను నీ కెట్టి యపకారమును జేయను. కాని నీవలనఁ జనిపోయిన వారు మాత్రము నిన్ను వదలిపెట్టరు. వారెప్పుడును నీకు భారముగనే యుందురు."

"మీ యుపకారమును మఱవలేను" అనెను సిల్వరు.

మేమందఱము గుహలోనికిఁ బోతిమి. అది చాల పరిశుభ్రముగనుండెను. అన్ని సౌకర్యములను గలిగియుండెను.

ఒకచోఁ జలిమంటనద్దఁ గెప్టెను స్మాలెటు కూర్చుండి యుండెను. అతనికి వెనుక బంగారము కుప్పలుకుప్పలుగా నుండెను. ఈ బంగారముకొఱ కెంతోమంది ప్రాణములఁ గోల్పోయియుందురని నాకుఁ దోఁచెను. దీనిని సంపాదించిన వారు దాని ననుభవింపఁజాలరైరి!

కెప్టెను స్మాలెటు ఇటులనెను. "జిమ్, నీవు చాల మంచికుఱ్ఱవాఁడవు. నిన్నే మనవలెనో నాకుఁదెలియకున్నది. నీవు, నేను సముద్రప్రయాణములకు బనికిరాము. సిల్వరు! ఇక్కడకు వచ్చినావేమి?"

"తిరిగి నా పనికి నేను వచ్చినాను." అని సిల్వరు బదులిడెను.

"అటులనా!" అనెను స్మాలెటు.

ఆ రాత్రి మహానందముగా భోజనము చేసితిమి. అన్నియు రుచికరమైన పదార్థములే! అంతయు సంతసమే!

సిల్వరేమియు మాటాడలేదుగాని తిండిమాత్రము కావలసినంత తినెను.

మఱునాఁటి యుదయము నిధిని గుహనుండి యోడ లోనికిఁ జేరవేయుట ప్రారంభించితిమి. పగలంతయు శ్రమపడి పనిచేసితిమి; గాని మాకేమియు విసుగుపుట్టలేదు. పారిపోయిన ముగ్వురు నావికులవలన మాకెట్టికష్టమును సంప్రాప్తింపలేదు. ఒకనాఁడు మాత్రము వారు పాడుచుఁ గాన్పించిరి. కొన్ని నాళ్ళకు నిధియంతయు నోడలోనికిఁ జేర్చితిమి.

ఈలోపల గ్రెలానియో, స్మాలెట్టో సిల్వరును అప హాస్యము చేయుచుండెడివారు. కాని సిల్వరేమియు మాటా డక యతివినయముగ నుండెడివాఁడు. బెన్‌గన్ మాత్రము సిల్వరనిన లోపలభయపడెడివాఁడు. సిల్వరెంత దుర్మార్గు డైనను, నతఁడొకప్పుడు నా ప్రాణములను రక్షించిన దాత యగుటచే నతనినేమియు ననెడివాఁడనుగాను.

చివరకు నోడ ధనరాసులతో బయలుదేఱెను. అప్పుడు పారిపోయిన ముగ్వురు నావికులు తమ్ముఁగూడ మాతోఁ దీసి కొని పోవలసినదని ప్రార్థించిరి. ఒకప్పుడు మాకు జాలి కలిగెనుగాని వారిదుర్మార్గమును దలఁచి యోడపై నెక్కించు కొనలేదు. అప్పుడు వారిలో నొకఁడు తుపాకి ప్రేల్చెను. అది సిల్వరు చెవిప్రక్కగా బోయెను. అటులవారి ద్రోహబుద్ధి

వ్యక్తమాయెను. మేము తుపాకులు తిరిగి ప్రేల్చుఁ బోవుసరికి వారు పారిపోయిరి. తరువాత వారు కనఁబడలేదు.

ఓడను నడపుటకుఁ దగినంతమంది సిబ్బంది లేకుండుటచే దక్షిణ అమెరికాకుఁ బోయి యొకరేవులో నోడను లంగరు వైచితిమి. నేను, ట్రెలాని, లివసి యూరిలోనికిఁ బోతిమి. ఆ యూరంతయు బాగుండెను ఒకచో నొక ఇంగ్లీషు ఓడ యజమానినిగూడఁ గలసికొంటిమి. మేము తిరిగి నావ వద్దకు వచ్చుసరికి సిల్వరు మాయమయ్యెను.

బెన్‌గన్ సిల్వరును బోనిచ్చెను. "ఎందులకు బోనిచ్చితి" వని ప్రశ్నింపఁగా బెన్‌గన్ ఇటుల సమాధానమిచ్చెను.

"ఒంటికాలివాఁ డోడపై నున్నంతకాలము మనకు రక్షణ యనునది లేదు. అతఁడుండుట మనకు క్షేమముకాదు, అందువలనఁ బోనిచ్చితిని. పోవునపుడు కొంత ధనమునుగూఁడ నీసికొని పోయినాఁడు."

సిల్వరు నంతసులభముగాఁ జౌకగా వదలించుకొనినందులకు మే మెంతయు సంతసించితిమి. బెన్‌గన్ నభినందించితిమి.

మఱికొంతమంది నావికుల సహాయ్యమున నోడ బయలుదేఱెను. మొదటఁ బ్రయాణముచేసిన వారిలో నైదుగురము మాత్రమే తిరుగు ప్రయాణములోనుంటిమి. ఎట్టకేలకు సురక్షితముగ బ్రిస్టలునగరమును జేరితిమి.

అందఱకును దృప్తికరముగ ధనరాసులను బంచుకొంటిమి. బెన్‌గన్ వట్టి అమాయకుఁడు. తనధనమును మూఁడు వారములలో ఖర్చుపెట్టెను. ఖర్చుపెట్టెననుటకంటెఁ బోఁగొట్టుకొనెననుట సమంజసముగానుండును. జమీందారు ట్రెలాని దయతలఁచి యాతనికొక పూటకూళ్ళయింటి నేర్పాటు చేసి దానిపై వచ్చు నాదాయముతో బ్రతుకుమనెను. సిల్వరు సంగతి మఱియింకేమియుఁ దెలియలేదు. ఇది నా బంగారు దీవి యాత్ర కథ.

---

వైశ్యరత్న ప్రింటింగు వర్క్సు, విజయవాడ-1.

# డేవిడ్ బాల్ఫరు

## 1

క్రీ. శ. 1751 వ సంవత్సరము, జూన్ మాసము నొకానొక ప్రభాతసమయము. అప్పటికి నాకుఁ బదునేడేండ్లు. తల్లిదండ్రు లంతకుమున్నే మరణించిరి. కడసారిగా ఎసెన్‌డీన్ గ్రామమునఁ బితృగృహమును వీడి భవిష్యత్తు నెదుర్కొనఁ బ్రపంచయాత్రకు బయలుదేఱితిని.

త్రోవలో నా గ్రామ మతాధికారియగు కాంబెల్ నన్నుఁ గలసికొని "ఈ గ్రామమును వీడుటకు విచారించుచుంటివా?" యని ప్రశ్నించెను. "ఈ గ్రామ మనిన నాకిష్టమే. కాని నా భవిష్యత్తును నిర్మించుకొనుట కింకొక ప్రదేశమున కేఁగుట కిష్టపడుదు" నని సమాధాన మొసఁగితిని.

అంత నా మతాధికారి యిట్లనియెను. "నీతండ్రి మరణసమయమున నాకొక యుత్తరము నిచ్చెను. నీవీయుత్తరమును ఎడింబరో నగరమునకు సమీపమునఁగల క్రామండుకు దగ్గఱలోనున్న షా వంశీయుల గృహమునకుఁ దీసికొనిపోవలయును. అది మీ వంశమే. చాల గౌరవనీయుల వంశము. నీ తండ్రి చాల ఉత్తముఁడైన యుపాధ్యాయుఁడు. అతఁడనిన మాకెంతయు నభిమానము. ఇదిగో ఆ యుత్తరము."

నేనా యుత్తరమును దీసికొంటిని. ఆ యుత్తరముపై నిట్లుండెను. "ఈ యుత్తరమును ఎబెనజరు బాల్ఫరుకు నాకుమారుఁడగు డేవిడ్ బాల్ఫరు ఈయవలయును."

"మీ సలహా యేమి?" అని నేను ప్రశ్నించితిని. "నీవు తప్పక పోవలయును. నిన్నచట స్వీకరించువారు లేకపోయినచో నీవిచటకుఁ దిరిగి రావలయును. కాని నీవాహ్వానింపఁ బడుదు వనియు, ననతికాలమున గొప్పవాఁడ వగుదువనియు నాశించు చున్నాను" అని మతాధికారి చెప్పెను.

తరువాత నాతఁడు నన్నొకచోఁ గూర్చుండఁబెట్టి యనేక నీతిసూత్రములను బోధించెను. ప్రార్థనలను సక్రమ ముగాఁ జేయుచుండవలసినదనియు, బైబిలును బారాయణము చేయుచుండవలసినదనియు హెచ్చరించెను. ఆతఁడింకను నిట్లనెను "ఇదిగో ఈ బంగీనిఁ దీసికొనుము. ఇందు నాలు వస్తువులు గలవు. మొదటిది నీతండ్రి పుస్తకములను వెలకుఁ గొని నందుల కీయవలసిన పైకము. రెండవది యొక గుండ్రనివస్తువు. మూఁడవది యొక వ్రాయఁబడిన వస్తువు. నాలుగవది యొక పెట్టె యాకారముగనుండు వస్తువు."

నాకొఱకాతఁడు దేవునిఁ బ్రార్థించి, నన్ను వీడ్కొలిపి, యాతఁడు వెనుదిరిగి చూడకయే యింటికిఁ బోయెను. నాకొఱ కాతఁడెంతయు విచారించుచుండెనని గ్రహించితిని. నేను మాత్రము నా వారినిఁ గలసికొని యభివృద్ధి చెందఁగల యవ కాశము లభించునందుల కెంతయు సంతసించుచుంటిని. తరు వాత నాతఁడిచ్చిన బంగీలో నేమిగలవో చూతమని విప్పితిని. ఆతఁడు గుండ్రని వస్తువనినది యొక షిల్లింగు నాణెము; పెట్టె వంటి యాకారముగల వస్తువు బైబిలు గ్రంథము. ఒక పచ్చని కాగితముపై లిల్లీ పుష్పములను ద్రాక్షారసమున మఱుఁగబెట్టి త్రాగినచోఁ గలుగు నుపయోగములు వ్రాయఁబడియుండెను.

పిమ్మట నెడింబరో మార్గమును బట్టితిని. మఱునాఁటి యుదయమునకు నెడింబరోనగరమును జేరితిని. ఎడింబరో పశ్చిమభాగమునకుఁ బోయి గ్లాస్గోమార్గమును జేరితిని. ఆ మార్గమునఁ గొంతదూరము ప్రయాణము చేయఁగాఁ గ్రామం డు వచ్చెను. అచట షా వంశీయుల గృహ మెక్కడఁగలదని పలువురఁ బ్రశ్నించితిని. షా యను పేరును వినునప్పటికి వారెల్లరు వింతగాఁ బ్రవర్తించుచుండిరి. నేను బోవుచున్న గృహము గొప్పదనియు, దానిని గూర్చి సాధారణవేషములో నున్న నేనడుగుట వారి కాశ్చర్యమును గొల్పుచున్నదనియుఁ దలఁచితిని. కాని యనేకు లొకేవిధముగాఁ బ్రవర్తించుటవలన నా కుటుంబములో నేదోయొక యపూర్వమైన వింతకలదని భావింపఁ దొడఁగితిని.

దారినిఁబోవుచున్న యొకబండివాని నాపి "షా వంశీయుల గృహమునుగూర్చి వినియున్నావా ?"యని ప్రశ్నించితిని. "నీవు చాల మంచిపిల్లవాఁడవు. ఆ యింటిజోలికిఁబోకు" మని యాతఁడు సమాధాన మొసఁగెను. "ఎబెనజరు బాల్ఫరు ఎట్టివాఁడు ?"అని యొక మంగలిసిఁ బ్రశ్నించితిని. ఆతఁడు సరియగు సమాధానము నొసఁగక నా పనినిఁగూర్చి తెలిసికొన బ్రయత్నించెను.

తరువాత నొక కొండనుండి దిగివచ్చుచున్న యొక స్త్రీ నడిగితిని. ఆమె రమణీయమగు ప్రకృతిమధ్య నొంటరిగనుండి శిథిలావస్థలోనున్న యొకగృహమును జూపెను. ఆ యింటియందెవరును నివాసమున్నటులలేదు. నా యాశ లొక్కపరి నిరాశలాయెను. ఆ స్త్రీ నాకుఁ గృహమును జూపుటతో సంతృప్తిఁ

జెండక షా వంశీయుల దుర్మార్గములను వివరించి, వారెన్నఁటి కైనను సర్వనాశనముఁ జెందుదురని వ్రాకుచ్చెను.

నేనొకచోఁ గూర్చుండి యా గృహము దిక్కునకుఁ జూచుచు మనోహరమగు ప్రకృతిదృశ్యముల వలని యానంద మును బొందఁజొచ్చితిని. అంత సూర్యుఁడ స్తమించెను. ఆ యింటి పొగగొట్టమునుండి కొలఁదిగ పొగ బయలకు రాఁ జొచ్చెను. అందువలన నా యింట మనుజులు గలరని నిశ్చ యించి యచటకు బయలుదేఱితిని. మార్గమేమియు బాగుండ లేదు. ఎట్టకేలకు గృహముదరికిఁబోతిని. దగ్గఱకుఁ బోయిన తరువాత నా గృహ మింకను నసహ్యముగఁ గాన్పించెను. గృహమింకను బూర్తిగా నిర్మింపఁబడి యుండలేదు. గబ్బి లము లటునిటు తిరుగాడుచుండెను.

అప్పటికి బాగుగఁ జీఁకటిపడెను. కిటికీలనుండి కొలఁదిగ వెలుఁగు కాన్పించుచుండెను. లోనఁ గొలఁదిగ పళ్లెముల చప్పుడు వినఁబడుచుండెను. తెరలు తెరలుగ వచ్చుచున్న దగ్గుగూడ వినఁబడుచుండెను. రెండు మూఁడుసార్లు తలుపు తట్టితిని. ఎవరును బలుకలేదు. తిరిగి నా గ్రామమునకుఁ బోఁదలచితిని. కాని వెంటనే కోపముతోఁ దలుపుపైఁ బిడి గ్రుద్దులు గ్రుద్ది 'బాల్ఫర్, బాల్ఫర్' అని గట్టిగా నఱవసాగితిని.

అంతలో నా తలకుఁ బైఁగా దగ్గువినఁబడెను. పైకిఁ జూచితిని. ఒకమనుజునితల, తుపాకి కాన్పించెను.

"ఎబెనజరు బాల్ఫరున కొక యుత్తరము తెచ్చితిని" అంటిని.

"ఎవరివద్దనుండి ?"

"నాకు దెలియదు."

"గుమ్మమువద్దఁ బడవైచిపొమ్ము."

"నేనా యుత్తరమును స్వయముగ నందఁజేయవల యును."

"నీ వెవరవు ?"

"నాపేరు డేవిడ్ బాల్ఫరు."

"మీ తండ్రి మరణించినాఁడు గదా ?"

"అవును. అందువలననే నేనిటకు వచ్చితిని."

"నేనిప్పుడే నిన్నులోనికిఁ బ్రవేశపెట్టెదను."

తల, తుపాకి అదృశ్యమాయెను.

## 2

ద్వారము తెఱవఁబడెను. నేను లోనికిఁ బ్రవేశించిన తరువాత తిరిగి మూయఁబడెను. "వంటగదిలోనికిఁ బొమ్ము. ఏమియు ముట్టకుము" అను నాజ్ఞ వినఁబడెను. నే నట్లుచేసితిని. ఆ గదియంతయుఁ జూడ నందలివారు కడుబీదవారని తోఁచు చుండెను.

అంతలో నా గదిలోని కొక మనుజుఁడు ప్రవేశించెను. ఆతనిని జూడఁగనే నాకు జుగుప్స, భయము కలిగెను. మాసిన గడ్డముతోను, జిరిగిన దుస్తులతోను నాతఁ డసహ్యముగ నుండెను. వయస్సు ఏబది, డెబ్బది వత్సరములకు మధ్యనుండు ననుకొంటిని. ఆతఁడు నన్ను దేవనిగ వక్రముగఁ జూడసాగెను.

"నీ కాఁకలివేయుచున్నది కాఁబోలు ! ఆహారమును భుజింపు" మని యాతఁడనెను. తాను బీరు పానీయమును ద్రాగఁ జొచ్చెను. "ఆయుత్తరము నిటు తెమ్ము" అని చేయి చాపెను. "అది బాల్ఫరునకుమాత్రమే యిత్తును" అంటిని.

"నే నెవరనుకొంటివి ? అలెగ్జాండరు ఉత్తరము నిటు తెమ్ము." అని యాతఁడనెను. నా తండ్రి పేరు నెఱుఁగుదువా!" యని ప్రశ్నించితిని. "అతఁడు నాస్వంత సోదరుఁడు. నీకు నేను, నాయిల్లు, నా భోజనము రుచింపకపోయినను మన చుట్టఱిక మెక్కడకునుబోదు. ఆ యుత్తరము నిటు తెమ్ము. తృప్తిగ భుజింపుము" అని యాతఁడనెను.

నేను మిగుల సిగ్గుపడితిని. వెంటనే నావద్దఁగల యుత్తరము నాతని కిచ్చి, యాతఁడిడిన యాహారమును భుజింపఁ గడఁగితిని. ఆతని ప్రశ్నలకు సమాధానముగా, నేనా యుత్తరమునందలి విషయము నెన్నఁడును జూడలేదనియు, నాయుత్తరము నాతని కిచ్చుటకే వచ్చితిననియుఁ దెలిపితిని. "నేను నీవద్దనుండి సాహాయ్యము నాశించుచున్నాను. కాని నేను యాచకుఁడనుగాను" అనిగూడఁ దెలిపితిని.

ఆతఁడు నన్నుఁజూచి భయపడుచున్నటులఁ దోఁచెను. నాకేమియు నర్థముకాలేదు. త్వరలో నంతయుఁ దెలియునను కొంటిని. "నాతండ్రి గతించి మూఁడు వారములైనది. నీవు చెప్పువరకు నాతనికొక సోదరుఁడు గలఁడనికూడఁ దెలియదు" అని చెప్పితిని. "ఎంతటి యాశ్చర్యకరమైన మానిసి ! అంతయు రహస్యమే !" అని యాతఁడనెను.

తరువాత నాతఁడు నన్నొకగదిలోనికిఁ దీసికొనిపోయి యచటఁ బరుండవలసినదిగాఁ గోరెను. అందు దీపములేదు. ఒకదీపము నీయవలసినదిగాఁ గోరఁగా నందులకాతఁడు నిరాకరించెను. నన్నులోననుంచి బయట తాళము వేసిపోయెను.

ఆ రాత్రి కెటులో యాగదిలో నిదురపోయితిని. తెల్లవారెను. అప్పుడాగదినిఁ గలయఁ జూచితిని. అది యొకప్పుడు మహావైభవముగా నుండిన ట్లుతోఁచెను. కాలవశమున నది శిథిలమాయెను. తరువాత నా పితృసోదరుఁ డేతెంచి తలుపు తెఱచెను. నేను బయటకుఁ బోయి ముఖప్రక్షాళనాది కార్యముల నిర్వర్తించితిని. పిమ్మట వంటగదిలోనికిఁ బోయి భోజనము చేసితిని. అతఁడు పొగపీల్చుచు నా తల్లినిఁ గూర్చి నా మిత్రులనుగూర్చి తెలిసికొనెను. పిమ్మట నాతఁడిట్లనెను.

“నేను నీకు న్యాయమును జేయఁ దలఁచుచున్నాను. నిన్నేవృత్తిలోఁ ప్రవేశపెట్టుదమా యని యాలోచించుచున్నాను. కాని యీ లోపల నీమిత్రులతో నుత్తరప్రత్యుత్తరములు జరుపరాదు. ఎట్టి సందేశములను బంపరాదు. నీ కిష్టములేనిచో నా గృహమును వీడిపోవచ్చును.”

“నేనుబోవుటకు సిద్ధముగా నున్నాను” అంటిని.

“వలదు వలదు. నేను నీకు రెండు మూఁడు రోజులలోఁ దగిన సాహాయ్యమును జేయఁగలను” అని యాతఁడనెను. నే నందులకుఁ గృతజ్ఞుఁడ నని సమాధాన మొసఁగితిని.

తరువాత సంభాషణసందర్భమున షా వంశీయులను దిట్టిన స్త్రీనిఁగూర్చి తెలిపితిని. ఆమెను శిక్షించు నుద్దేశ్యముతో

నాతఁ డూరిలోనికి బయలు దేఱఁబోయెను. నన్నుఁగూడఁ బయటకు రావలసినదనియు, నింటికిఁ దాళము వైతుననియుఁ జెప్పెను. నిలువెత్తు ధనమిచ్చినను నేనట్టి హీనస్థితి కంగీకరింపనని తెలిపితిని. అంత నాతఁడు ప్రయాణమునే విరమించుకొనెను.

అతనితో నే నిట్లంటిని. "నన్ను నీవు దొంగవలె జూచు చున్నావు. నేనన్న నీ కేమాత్రము నిష్టములేదు. అట్టియెడ నే నిచ్చట నుండుటవలన లాభ మేమి ? నేను దిరిగిపోయెదను."

"వలదు. వలదు. నీవనిన నాకుఁ గడు ప్రీతి. మనమిరువురము త్వరలో నేకీభవింపఁగలము. ఈ గృహ గౌరవమును నిలుపుటకై నిన్ను బయటకుఁ బోనీయను" అని యాతఁడనెను.

"నేనింకఁ గొంతకాలము వేచియుండును. నే నితరుల సాహాయ్యమును బొందుటకంటె నీ సాహాయ్యమును బొందుటయేసరి. మన మిరువుర మేకీభవింపఁ జాలనిచో నది నీలోపమే కాని నా లోపమెన్నఁటికినిఁ గాజాలదు" అని యుద్ఘాటించితిని.

# 3

పగలంతయు వంటగదికిఁ బ్రక్కగానున్న గదిలోఁ గడపితిని. అందు రకరకముల పుస్తకము లుండెను. వానిలోఁ గొన్నింటినిఁ జదువుట మిగుల నానందకరముగ నుండెను. నా తండ్రి సోదరుని విషపుచూపులు తక్క నంతయు బాగుగా నున్నటులఁ దోచెను.

ఒక పుస్తకములో మొదటిపుటపై నిట్లు వ్రాయఁబడి యుండెను. 'నా సోదరుఁడగు ఎబెనజరు కాతని యైదవ జన్మ దినోత్సవమునాఁ డిచ్చిన బహుమానము.' అది నా తండ్రి వ్రాఁత. నాతండ్రి చిన్నవాఁడగుటచే నాతఁడటుల వ్రాయుటలో నేదేని పొరపాటును జేసియుండవలెను. లేదా యప్పటికే నా తండ్రి చక్కనివ్రాఁత వ్రాయనేర్చియుండవలెను.

అందువలన నేను నాతండ్రి సోదరునితో "మా తండ్రి చిన్ననాఁడే పుస్తకములను జదివెడివాఁడు కాదా?" యని యంటిని. "కాదు; నాకంటెఁ దక్కువగా నుండెడివాఁడు" అని యాతఁడు జవాబిచ్చెను. "మీ రిరువురును గవలపిల్లలా?" యని ప్రశ్నించితిని. "ఈ ప్రశ్న నెందులకు వేయుచున్నావు?" అని యాతఁడు నా కోటుపైఁ జేయినైచెను. "ఇది మర్యాద కాదు. చేయితీయుము" అని యంటిని. అంత నాతఁడు చేయి తీసివైచి యిటులనెను. "నీ తండ్రినిఁగూర్చి మాటాడవలదు. నా కాతఁడొక్కఁడే సోదరుఁడు."

ఆతని ప్రవర్తన నాకర్థముకాలేదు. అతనికిఁ బిచ్చియెత్తి యుండవలెను; లేదా నాకు న్యాయముగా రావలసిన దానిని రాకుండఁ జేయుటకుఁ బ్రయత్నించుచుండవలయును; అని భావించితిని. ఆతఁడు నన్ను, నే నాతనిని చూచుట ప్రారంభించితిమి. కొంతతడవైన తరువాత నాతఁ డిటులనెను.

"నీవు పుట్టకపూర్వమే కొంతధనము నిత్తునని నీ తండ్రికి వాగ్దానముచేసియున్నాను. ఆ ధనము నిప్పుడు నీకిత్తును. నలుబది పౌనులుండును. నీవు కొంచెము బయటకుఁ బోయినచో, నేనా ధనమునుదీసి నీ కిత్తును."

నేను బయటకుఁబోయి కొంతతడవైన తరువాతఁ దిరిగి లోనికి వచ్చితిని. అపు డాతఁడు నా చేతిలోఁ గొన్ని గినీ నాణె ముల నిడెను. ఆతనికి హఠాత్తుగఁ గలిగిన దయకు నే నాశ్చర్య పడితిని.

"నా వాగ్దానమును నెరవేర్చుకొంటిని. ఇటులచేయుట నాకు మిగుల నానందకరముగనున్నది" అని యాతడనెను.

నేను దగినటుల నా కృతజ్ఞతను దెలిపితిని. ఆతఁడేల ధనమును నాకిచ్చెనో, నాకంతయు నగమ్యగోచరముగ నుండెను. ఆతఁడు చెప్పినకారణము నాకునచ్చలేదు. ముందేమి జరుగనున్నదోయని యాలోచింపఁ దొడఁగితిని.

కొంత తడవైన తరువాత నాతఁడు జేబునుండి యొక తాళపుచెవిని తీసి నాకిచ్చి యిట్లనెను. "నీవు వీధి ద్వారమున బయటకుఁబోయి మేడ మెట్లెక్కి పైనగదిలోఁగల పెట్టెను దీసికొని రావలయును. అందు మనయాస్తికి సంబంధించిన కొన్ని కాగితములుగలవు. నీకు దీప మవసరములేదు. మేడ మెట్లు చాలబాగున్నవి."

నే నందుల కంగీకరించి బయటకుఁ బోతిని. అంతయు నంధకారముగనుండెను. మేడమెట్లెక్కి పైకిఁబోయితిని. అంత నొక్క మెఱుపు మెఱసెను. అపుడంతయుఁ దేటతెల్లముగఁ గనఁబడెను. మెట్లు శిథిలావస్థలోనుండెను. గది నిర్మాణ మింకను బూర్తికాలేదు. ఈ పాటికి నే నేక్షణములోనైనను గ్రిందబడి నామరూపములులేకుండ మరణించియుండవలసినది. అప్పుడు నాకంతయు నర్థమాయెను. నా తండ్రి సోదరుఁడు

నా మరణమును వాంఛించుచున్నాఁడు. అందువలన నెట్లయి నను బ్రతికి యీ కథ యంతమును జూడవలెనను నిశ్చయము నకు వచ్చితిని. అంత వర్షము ప్రారంభమాయెను

భగవంతునిపై భారమునైచి వచ్చినదారినిఁ గ్రిందకు దిగితిని. ఎటుల దిగితినో యా పరమాత్మకే యెఱుక. గుమ్మ ములో నొక మానిసి నిలఁబడియుండుట జూచితిని వెలుఁ గులో నాతఁడు నా తండ్రి సోదరుఁడని గుర్తించితిని. అంత నొక యుఱుము గొప్ప సవ్వడిఁ జేసెను. నేను గ్రిందఁబడితి నని యాతఁడు భావించెనుగాఁబోలు లోనికిఁ బోయెను. నేనును వెనుకనే లోపలకుఁ బ్రవేశించితిని.

అతఁడొకచోఁ గూర్చుండి వణఁకుచు మత్తుపానీయము లను ద్రాఁగజొచ్చెను. అపుడాతని యెదుట నేను హఠాత్తుగఁ బ్రత్యక్షమైతిని. అంత నాతఁడు వికృతముగ నఱచి మరణించిన వానివలె నేలపైఁ బడెను. నేనా గదియంతయు వెదకితిని. కావలసినంత యాహారము, డబ్బు నాకుఁ గనఁబడెను. ఆత్మ రక్షణకై యొక బాకునుదీసి దుస్తులలో దాఁచుకొంటిని. తరు వాత నాతని ముఖముపై నీళ్ళు చల్లితిని. అపుడాతఁడు కొంత తెప్పరిల్లెను.

"నీవు బ్రతికియే యున్నావా ?" అని యాతఁడు ప్రశ్నించెను. "అవును" అని యంటిని. అతని కోరికపై నొక మందునుగూడ దీసియిచ్చితిని. అతఁడు దానిని ద్రాగిన తరువాత నిటులంటిని. "నీవు ప్రతిమాటకు నసత్యమేల పలుకు చున్నావు ? నేను నిన్ను వదలిపోయెదనేమో యని యేల భయ

పడుచున్నావు ? నాతండ్రి, నీవు కేవల పిల్లలాయని యడిగి నప్పుడు నీకంత కోపమేలకలిగినది ? అదినిజమగుటవలననా ? నాకు ధనమేల యిచ్చితివి ? కడకు నన్నుఁ జంపుట కేల ప్రయత్నించితివి ? సర్వము నాకు వివరింపుము.”

“ రేపు తప్పక చెప్పెదను ” అని యాతఁడు హీనస్వరమున ననెను. ఆతని నొక గదియందుంచి తాళము వైచితిని. పిమ్మటఁ బెద్ద నెగడును రగులఁజేసి సుఖనిద్రఁ జెందితిని.

# 4

మఱునాఁటి యుదయమే లేచి కాలకృత్యములన్నియుఁ దీర్చుకొని ముందనుసరింపవలసిన కార్యక్రమమునుగూర్చి యాలోచించితిని. నా తండ్రి సోదరుఁడు నాకు విరోధి యనుటలో నెట్టి సందియముకు లేదు. అతడెట్లయినను నన్ను నాశనము చేయుటకుఁ బ్రయత్నించును. నా ప్రాణములను నేనే రక్షించుకొనవలసియున్నది. అందులకు వలయుఁ దెలివితేటలు, సాహసము నాకుఁ గలవనుట స్పష్టమే. కావునఁ గుక్క కాటుకుఁ జెప్పుదెబ్బ యనినటుల నాతనికి బుద్ధిఁ జెప్పవలయును.

ఈ విధముగా నాలోచించుకొని యాతనివద్దకుఁ బోతిని. ఇరువురము భోజనమొనర్పసాగితిమి. అతనితో నే నిట్లంటిని. “ మన మిరువుర మొకరినొకరు అర్థముచేసికొనవలసిన సమయమే తెంచినది. నేనేమో యొక తెలివితక్కువ పల్లెటూరి కుఱ్ఱవాఁడనని భావించితివి. నీవు మంచివాఁడవని నేను భావించితిని. ఇరువురి యభిప్రాయములును బొరపాటే. నేను నిన్న నిన్నడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పుము.”

త్వరలోనే చెప్పుదునని యాతఁడనెను. ఏదేని యొక యసత్యమును గల్పించి చెప్పుట కాతడింకను సిద్ధపడియుండ లేదని తలఁచితిని. అంతలో వీధితలుపులు తట్టిన చప్పుడాయెను. పోయి తలుపుతీసితిని. సముద్రపు దుస్తులు ధరించిన యొక బాలుఁడు కనఁబడెను. అతని ప్రవర్తన వింతగానుండెను. "కవెనెంటు అను నోడ కెప్టెనగు హోసీసను వద్దనుండి బాల్ఫరున కొకయుత్తరమును దెచ్చితి" నని యాతఁడు నుడివెను. అతనిని లోనఁ బ్రవేశపెట్టితిని.

నా తండ్రి సోదరుఁ డాతని వద్దనుండి యుత్తరమును దీసి కొని చదివెను. ఈలోపల నా కుఱ్ఱవానికి భోజనము పెట్టితిని. ఆ యుత్తరము నేనుగూడఁ జదివితిని. ఓడ సముద్రాంతర దేశములకుఁ బోవుచున్నదనియు, నే నైన పనులున్న వో వెంటనే తెలుపవలసినదనియు నోడకెప్టెనగు హోసీసను ఆ యుత్తరమున వ్రాసెను.

నేనా యుత్తరమును జదివిన తరువాత నా పితృసోదరుఁ డిట్లనియెను. "కవెనెంట్ ఓడ కెప్టెనగు హోసీసనుతో నాకుఁ బనియున్నది. మన మిరువురము పోయినచో నాతనిని హోవే సత్రములోఁగాని, యేవైన కాగితములపై సంతకములు పెట్టవలసి వచ్చినచోఁ గవెనెంటు ఓడపైఁగాని కలసికొన వచ్చును. న్యాయవాది రాన్‌కీలరునుగూడఁ గలసికొందము. నీవు నా మాటలను నమ్మకపోయినచో నాతని మాటలనైన నమ్మవచ్చును గదా. అతఁడు చాలగౌరవనీయుఁడు. నీ తండ్రిని బాగుగా నెఱుఁగును.

మేముపోవు ప్రదేశమునఁ జాలమంది జనులుందురు గనుక నచట నాతఁడు నా కెట్టి యపకారమును జేయజాలఁ డని తలఁచితిని. న్యాయవాది రాన్ కీలరును గలసికొనవచ్చు ననియు, సముద్రమును, నోడలను జూడవచ్చుననియుఁ దలఁచితిని. అందువలన నాతనితోఁ గలసిపోవుట కిష్టపడితిని.

మేము ముప్పురమును బయలుదేరితిమి. ఎబెనజరు ఏమియు మాటాడక నడచుచుండెను. నేనును నోడలోఁ బని చేయు కుఱ్ఱవాఁడును గబురలోనికి దిగితిమి. అతని పేరు రేన్సము. అతని వయస్సెంతో యాతనికే తెలియదు. ఆతని మాటలన్నియు నీచులు మాటాడుకొను మాటలే. తాను చేసిన హత్యలు, దొంగతనములు మున్నగు వానినిఁ గూర్చి యాతఁడు సగర్వముగాఁ జెప్పెను.

కెప్టెను హోసీసను చాల గొప్పవాడనియు, నీ లోకమున గాని, మఱియొక లోకమునఁగాని నెవరిని లెక్క-చేయడనియుఁ గ్రూరుడనియుఁ దెలిపెను. కాని యతనిలో నొకలోటుగలదు. అతఁడు సమర్థుఁడైన నావికుఁడు కాదు. ఆ లోటును మఱియొక నావికుఁడగు షూవను తీర్చును. షూవను గొప్ప త్రాగుబోతు; నిర్దయుఁడు, స్వల్పమగు తప్పునకే రేన్సమును కఠినముగాఁ గాయపరచెను.

"కాని యీ గాయపఱచిన ఫలితము నాతఁ డనుభవింపఁగలఁడు. ఇదిగో చాకు. సమయము వచ్చినప్పుడు దీనితో నాతనిని బొడిచి చంపెదను" అని రేన్సము చెప్పెను.

తరువాత రేన్సము తన జీవితమునఁగల సుఖమును గూర్చి వివరముగా ముచ్చటించెను. సముద్రజీవితము మిగుల నపాయకరమైనదైనను నొడ్డునకు వచ్చినప్పుడు కావలసిన వస్తువుల నన్నింటిని స్వేచ్ఛగాఁ గొనవచ్చును. తనకంటెఁ జిన్నవారగు పనివారినిఁ దన యిచ్చవచ్చినటుల శిక్షింపవచ్చును. ఆతని జీవితము ఉత్తర అమెరికాకుఁ బంపఁబడు బానిసల జీవితము కంటెను, దొంగిలింపఁబడి వెలకు నమ్మఁబడెడు నభాగ్యుల జీవితముకంటెను గడుమేలైనది.

అంతలో సముద్రపుటొడ్డున నొక పడవ కాన్పించెను. అది కవెనెంటు ఓడకుఁ జెందిన పడవయనియు, గ్రెపెనుకొఱకు వేచియున్నదనియు రేన్సము తెలిపెను. అచటకుఁ గొలఁది దూరమున సముద్రముననున్న కవెనెంటు ఓడనుగూడఁ జూచితిని. రేన్సము మాటలను విన్నతరువాత నా యోడను జూడఁగనే నాకమితమగు నసహ్యము కలిగెను. ఆ యోడలోని వారినిఁ గూర్చి మిగుల జాలిపడితిని.

నేను నా తండ్రి సోదరునితో నిట్లంటిని. "నే నేసందర్భమునను గవెనెంటు ఓడపైకి రాఁజాలను." నా మాటలను విననివానివలె నాతఁడేమో ప్రశ్నించెను. నే నిదివఱకుఁ జెప్పిన దానినే మరలఁ జెప్పితిని. నా మాట లాతనికి రుచింపలేదని గ్రహించితిని. తరువాత మాటాడుకొనవచ్చునని యాతఁడు బదులుపలికెను.

## 5

వేము మున్వ్వరము హావేసత్రమును జేరితిమి. రేన్సము మేడపైఁగల యొకగదిలోనికిఁ దీసికొనిపోయెను. ఆ గది మిగుల వేఁడిగానుండెను. ఒక కుర్చీపైఁ బూర్తిగ దుస్తుల ధరించి యున్న కెప్టెను హాసీసను కూర్చుండియుండెను.

అతఁడు నా తండ్రి సోదరునిఁ జూడఁగనే ముందునకు వచ్చి మిగుల నాప్యాయముగ నాహ్వానించెను. సమయమునకు వచ్చినందులకుఁ దన యానందమును వెలిపుచ్చెను. గది చాల వేఁడిగా నున్నదని ఎబెనజరు అనెను. అది తన యలవాటని కెప్టెను చెప్పెను. ఎవరి యలవాట్లు వారికిఁ దప్పవని ఎబెనజరు సమర్థించెను.

కెప్టెను అలవాటు నా దురదృష్టమునకుఁ గారణమాయెనని చెప్పకతప్పదు. నే నా వేఁడిని భరింపజాలకపోతిని. సముద్రమును జూడవలెనను కుతూహలము మెండాయెను. అందువలనఁ గ్రిందకుఁబోయి యాడుకొనవలసినదని ఎబెనజరు చెప్పఁగానే బుద్ధిహీనుఁడనై యటులఁ జేసితిని.

సముద్రపు టొడ్డునకుఁబోయి యచటి దృశ్యములఁ జూడసాగితిని. అచటి నావికులు రకరకములైన దుస్తులు, ఆయుధములు ధరించియుండిరి. వారందఱును మిగులఁ గ్రూరులుగఁ గాన్పించిరి. వారిలోఁ దక్కువ క్రూరుఁడని తలఁచినవాని నొకనిని బ్రశ్నించితిని. అతఁడు మిగుల జుగుప్సాకరమగు సమాధానముల నొసఁగెను. అంతలో రేన్సము కాన్పించెను. ఇరువురమును దిరిగి సత్రవుకుఁ బోతిమి.

సత్రవుంలో ముందుగదిలోఁ గూర్చుండి యిరువురము బీరు పానీయమును త్రాగితిమి. సత్రవుయజమానితో స్నేహము చేయవలెనను నభిప్రాయము నాకుఁ గలిగెను. అందువలన నాతనిని గూడ మా నద్దకు వచ్చి పానీయమును ద్రాగవలసిన దని కోరితిని. కాని మా వంటి నిర్ధనులతోఁ బాటు కూర్చుండి పానీయమును సేవించుట తన గౌరవమునకు భంగమని యాతఁడు తలఁచి యుండనోపు. అందువలన నాతఁడు గదినివీడి పోఁబోయెను.

అతనిని మరలఁ బిలచి "న్యాయవాది రాన్‌కీలరు నెఱుఁగుదురా?" అని ప్రశ్నించితిని.

"రాన్‌కీలరు నేగాదు; ఎబెనజరునుగూడ నెఱుఁగుదును. ఒకానొకప్పు డాతఁడు మంచివాఁడే గాని యిప్పుడు కడుదుర్మార్గుఁడని చెప్పవచ్చును. ఏలయన నాతఁడే తన సోదరుఁడగు నలెగ్జాండరును జంపెనను ప్రతీతి గలదు. అతఁడటుల నెందులకుఁ జేసెననఁగా షా వంశీయులయాస్తియంత యుఁ గాఁ జేయఁ దలఁచెను. అలెగ్జాండరు పెద్దవాఁడుగదా! అతఁడు జీవించి యున్నచో నెబెనజరుకుఁ జిల్లిగవ్వయైనను దక్కియుండెడిది కాదు." అని సత్రవు యజమాని చెప్పి లోనికిఁబోయెను.

నా తండ్రి పెద్దవాఁడను విషయమును నే నిదివఱకే యూహించితిని. అది యిపుడు నిర్ధారణమైనది. నా యదృష్టమునకు నే నెంతయు సంతసించితిని. ఏలయన జ్యేష్ఠుని కుమారుఁడనగు నాకే షా వంశీయుల యాస్తియంతయు సంక్రమించును. అందువలన నే ఎబెనజరు నన్నుఁ జంపఁదలంచు

చున్నాఁడని యనుకొంటిని. నా మనస్సు పరిపరివిధముల నాలోచింపఁదొడఁగెను.

అంతలో నా పినతండ్రి పిలుపు వినఁబడెను. నేను బయటకుఁ బోతిని. నా పినతండ్రి, కెప్టెను ఒకచో మాటాడుకొనుచుండిరి. కెప్టెను నాతో నిట్లనెను. "నిన్నుఁగూర్చి బాల్ఫరు చాల మంచిగాఁ జెప్పినాఁడు. నీ స్నేహము మిగుల వాంఛనీయము. కాని యెక్కువకాల మిచ్చట నుండుటకు సెలు పడనందుల కెంతయు విచారించుచున్నాను. నీవు కవెనెంటు ఓడపైకి వచ్చి నీ స్నేహమును జూపవలెను."

ఓడ లోపలిభాగమును జూడవలెనని యెంత కుతూహల పడుచున్నను నపాయకరమగు పరిస్థితులలోనికిఁ బోదలంచలేదు. ఒక న్యాయవాదినిఁ జూడవలసి యున్నందున నోడలోనికి రాఁజాలనని నా విచారము వెలిపుచ్చితిని.

"బాల్ఫరా విషయమును నాకుఁ జెప్పినాఁడు. పడవను న్యాయవాది యింటిసమీప ప్రదేశమునకుఁ బంపుదును" అని కెప్టెననెను. నేను మెత్తపడుటకు సిద్ధముగా నుంటిని. అంతలో నాతఁడు నన్నుఁ బ్రక్కకుఁ బిలచి రహస్యముగా నిటులనెను. "ఎబెనజరు కడు దుర్మార్గుఁడు. నీకు హానినిఁ దలపెట్టి యున్నాఁడు. ఓడపైకి వచ్చిన చెప్పుదును."

ఓడపైకిఁ బోవుటకు బూర్తిగ నిష్టపడితిని. వెంటనే మేమందరము పడవ నెక్కితిమి. నా యదృష్టమునకు నే నెంతయు సంతసించుచుంటిని. పడవ, యోడను సమీపించెను. కెప్టెను, నేను మొదట నోడ నెక్కుటకు నిశ్చయించితిమి. ఒక కుర్చీ

సాహాయ్యమున నే నోడ పై భాగమునకుఁ దీసికొనిపోఁబడితిని. అచట కెప్టెను సిద్ధముగానుండెను. నాకేమో కొంచెదిగ భీతి కలిగెను. కాని యచటి వింత దృశ్యములు నా కానందమును గొల్పుచుండెను. కెప్టెను అన్ని విశేషములను నాకు వివర ముగాఁ దెలియఁజేయుచుండెను.

అంతలో నా పినతండ్రిమాట జ్ఞప్తికి వచ్చెను అతఁ డచటలేఁడు. ఒక్కపరి యొడలు జలదరించెను. సర్వనాశన మైనదని తలఁచితిని. నలుదిక్కులఁ గలయఁజూచితిని. ఓడ దగ్గఱనుండి యొక పడవ తీరమునకుఁ బోవుచుండెను. ఆ పడ వలో నా పినతండ్రి కలఁడు. అతఁడు నా వైపునకు మిగులఁ గ్రూరముగఁ జూచుచుండెను.

" హత్య! హత్య! సహాయము చేయుఁడు " అని యరచితిని. వెనుకనుండి నలుగురు మనుజులు వచ్చిరి. నా నోట గుడ్డలు గ్రుక్కిరి. తలపై బలముగ దెబ్బను గొట్టిరి. కాళ్లు చేతులు త్రాళ్ళతోఁ గట్టిరి. నేను నిస్సహాయుఁడనైతిని. నా యాశా సౌధములన్నియు నేలఁగూలెను.

## 6

ఓడ లోపలి భాగమున నొక చీఁకటి కొట్టములో నన్నుఁ బారవైచిరి. శరీరమంతయు బాధగా నుండెను. మనస్సాందో ళనాయుతమై యుండెను. ఏమియుఁ దోఁచకుండెను. రాత్రిం బగళ్లొకే విధముగా నుండెను. ఆ విధముగా నెంతకాలము గడచెనో తెలియకుండెను. కాని యంతలో నిదుర పట్టుటచే సర్వమును మఱచితిని.

ఒకప్పుడు మెలకువ వచ్చెను. పచ్చని కన్నులుగల యొక ముప్పదేండ్ల మానిసి నా ముఖమువద్ద దీపముపెట్టి నిల బడి యుండెను. అతఁడు నన్నుఁ బరిశీలించుచుండెను. నా యారోగ్య మెట్టులున్నదని యాతఁడు ప్రశ్నించెను. నా నాడినిఁ బరీక్షించి, తలపై గాయమునకుఁ గట్టు కట్టెను. నాపట్ల దన సానుభూతినిఁ బ్రకటించెను. త్రాగుట కొక పానీయమునుగూడ నిచ్చెను. పిమ్మట నన్ను వీడిపోయెను.

అతఁడు మఱియొకసారి నావద్దకు వచ్చెను. అతనితోఁ బాటు కెప్టెనుగూడ వచ్చెను. మొదటివాఁడు నన్నుఁ బరీక్షించి నా గాయమునకుఁ గట్టు కట్టెను. అతని పేరు రియాకు అని కెప్టెను పిలుచుచుండగాఁ దెలిసికొంటిని. అతఁడు నా కుపయోగకరమగు మిత్రుఁడు కాఁగలడని తలఁచితిని.

కొలఁది నిమిషములైన తరువాత నా బంధములన్నియు నూడదీయఁబడెను. అక్కడనుండి నేను ఓడలో వేఱొక ప్రదేశమునకుఁ గొనిపోఁబడితిని. అచట నుంచుట నాకు కొంత హాయినిఁ గూర్చెను. తిరిగి మనుజులమధ్య నుండుట కవకాశము గలిగెను. పనిలేని నావికులు కూర్చుండి వినోద కాలక్షేపము చేయుట కొఱకేర్పఱుపఁ బడిన గది యది. అచట రియాకు నా కొఱకుఁ బ్రత్యేకముగాఁ దయారుచేసి పంపిన పానీయమును ద్రాగితిని. అచట నేను చాల దినములుంటిని. ఈ లోపల నా యారోగ్య మభివృద్ధి చెందెను. ఆ నావికులను గూర్చిన కొన్ని విషయములను గూడ దెలిసికొనఁ గలిగితిని.

నావికు లెల్లరు మొరటు తేలినవారు. జీవిత మంతయు సముద్రముపైఁ గడపినవారు. అందుఁ గొంద ఱిదివఱకు సముద్రపు దొంగలతోఁ గలసి పనిచేసిరి. కొందఱు ప్రభుత్వము వారి నావలనుండి పారిపోయి వచ్చిరి. వారెల్లరు కడు దుర్మార్గులనియు, స్నేహపాత్రులు కారనియు మొదట భావించితిని. తరువాత నా యభిప్రాయమును గొంతవఱకైనను మార్చుకొన వలసిన యవసరము కలిగెను. వారికిఁ గూడ దయ, నిజాయితి మున్నగు సద్గుణములు కొన్ని కలవని తెలిసికొనఁగలిగితిని.

వారు నావద్ద దొంగిలించిన ధనములో నెక్కువ భాగము తిరుగ నిచ్చివైచిరి. ఓడ ఉత్తర అమెరికాలోని కెరొలైనాకుఁ బోవుచుండెనని తెలిసికొంటిని. అచటఁ గల ప్రత్తిభూములలోఁ బనిచేయుటకు బానిసగా నమ్మఁబడుటకు నేను నా పినతండ్రిచేఁ బంపఁబడుచుంటిని !

అప్పు డప్పుడు నన్ను రేన్సము కలసికొనుచుండెను. తన గాయములకుఁ గట్లు కట్టుకొనుచు నధికారియగు షూవనును దూషించు చుండెడివాఁడు. కాని షూవ ననినఁ జాలమందికి భయభక్తులు కలవని గ్రహించితిని. నేను రేన్సమును బుద్ధి గఱపఁ దలఁచితిని. ఆతనిలోని మానవత్వమును రేకెత్తింపఁ దలఁచితిని. కాని యాతఁడు చిన్ననాఁటినుండి సముద్రములపైఁ బ్రయాణము చేయుచుండుటచే నాతని కితరవిషయము లేవియు సరిగాఁ దెలియవు. నేలపై జీవించుచున్నవారందఱు నమితముగ గష్టముల పాలగుచున్నారని యాతఁడు భావించుచుండెను.

రియాకు ఆతనికిఁ ద్రాగుట నేర్పెను. అందాతని కెట్టి దురుద్దేశ్యమును లేదు. కాని యది రేన్సము ఆరోగ్యమునకు హానిచేయుచుండెను.

ఈ లోపల నోడపై భాగమునకుఁ బోవుటకు నా కనుజ్ఞ యీయఁబడలేదు. గదిని వీడిపోవుటకు వీలులేకుండెను. అందు వలన నొక విధమగు విసుగు జనించెను.

## 7

ఒకనాఁటి రాత్రి పదునొకండు గంటలకు షూవను, రేన్సమును హత్య గావించెనను వార్త యోడయందంతట వ్యాపించెను. మా గదిలోని వారము విభ్రాంతులమైతిమి. అంతలోఁ గెప్టెను హాసీసను మా గదిలోనికివచ్చెను. దీపము సాహాయ్యమున నాఁకఁ డందఱను బరిశీలించి, నా వద్దకు వచ్చి యిటులనెను.

"నీవు రేన్సముస్థానము నాక్రమింపవలయును. ఇఁక నుండి నీవు అధికారుల గదిలోఁ బనిచేయవలయును."

అంతలో నిరువురు మనుజులు రేన్సము నటకుఁ దీసికొని వచ్చిరి. వెలుఁగులో నాతని ముఖమును జూచితిని. ప్రేతకళ యావరించియుండెను. ఒక్కసారి నా యొడలు గగుర్పాటు చెందెను. ముచ్చెమటలు పోసెను. వెంటనే యోడపై భాగ మునకుఁ బరుగెత్తితిని.

పిమ్మట నేను బనిచేయవలసిన యధికారుల గదిలోనికిఁ బోతిని. అది చాల విశాలముగనుండెను. కుర్చీలు మున్నగు

నవి యమర్పఁబడియుండెను. అధికారులు నిదురించుటకుఁ దగిన సౌకర్యములుగూడ నుండెను. దాని క్రింద మఱియొక గది యుండెను. అందు విలువగు నాహారపదార్థములు, పానీయములు, ఆయుధసామగ్రి మున్నగున వన్నియు నుండెను.

నేను అధికారుల గదిలోనికి మొదటఁ బ్రవేశించుసరికి షూవను యొక కుర్చీపైఁ గూర్చుండియుండెను. అతని ముందొక బ్రాందీసీసాకూడ నుండెను. నే నా గదిలోఁ బ్రవేశించినపు డాతఁడేమియుఁ జలింపలేదు. తరువాత గ్రెపైను వచ్చినప్పుడుకూడ నాతఁ డటులేయుండెను. అంతలో రియాకుకూడ వచ్చెను. రేన్సము మరణించెనను వార్త యాతని ముఖమున బ్రస్ఫుటముగాఁ గానవచ్చుచుండెను. మేము ముగ్వురము యొక్క మాట యైనను బలుకక షూవనును జూచుచుంటిమి. షూవను తన ముందుగల బల్లను జూచుచుండెను.

అంతలో షూవను తన ముందుగల బ్రాందీసీసాకొఱకుఁ జేయిచాచెను. రియాకు వెంటనే యటకుఁబోయి యా సీసాను లాగుకొని సముద్రములోనికి విసరివైచెను. షూవను వెంటనే లేచి రియాకును హత్యచేయఁబూనెను. కాని కెప్టెను మధ్యనడ్డమువచ్చి షూవనును గద్దించి దూషించెను. ఇదివఱకే యాతఁడొక హత్యను గావించెనని హెచ్చరించెను. "కుఱ్ఱవాఁడొక యశుభమగు పాత్రను దెచ్చెను" అని షూవన నెను.

మేము ముగ్వురమును భయపడితిమి. కెప్టెను షూవను భుజమును బట్టుకొని కుర్చీపైఁ గూర్చుండఁజేసెను. "ఈ రాత్రి జరిగిన విషయ మెవరకును దెలియరాదు. ఆతఁడు పొరపాటున

సముద్రములోఁ బడినటులఁ జెప్పవలయును ” అని కెప్టెను హెచ్చరించెను. తరువాత వారిరువురును బానీయములను సేవించిరి.

నేను నా పనులను మిగుల నిష్టముతో నిర్వర్తింప సాగితిని. అంతయు సులభముగానుండెను. వారి కాహార పదార్థములను, బానీయములను సరఫగా చేయుచుంటిని. నాకుఁ బరుండుటకుఁ దగిన యేర్పాట్లుగూడ నుండెను. కెప్టెను, రియాకు నన్ను దయతోఁ జూచుచుండిరి. నాకుఁ గావలసిన యాహార పదార్థములను భుజించుటకుఁ గూడ వీలుకలిగెను. నా కిచ్చవచ్చినచోఁ బానీయములను ద్రాగుటకుఁ గూడ వీలుండెను. రియాకు ప్రీతి పాత్రుఁడగు స్నేహితునివలె ననేక విషయములను జెప్పుచుండెను. అందుఁ గొన్ని యుపయోగమైన విషయములుగూడ నుండెడివి. కెప్టెనుకూడ నప్పుడప్పుడు దయతోఁ దన యనుభవములను వివరించెడివాఁడు

షూవను త్రాగుఁబోతు. అతఁడు మితిమీఱి త్రాగి యొడలు తెలియని పరిస్థితిలో రేన్సమును హత్యచేసినని తలంచితిని. అతఁడు చాల రోజులవరకు నే సచటఁ బనిచేయుచున్న విషయమునే గుర్తింపలేదు. ఒకనాఁడాతఁడు నావద్దకు హఠాత్తుగ వచ్చెను. నాకు మరణసమయ మాసన్నమాయెనని తలఁచితిని. కాని యతఁడు “నీవిదివఱకిచ్చట నుంటివా? యని ప్రశ్నించెను. “ లేదు ” అని సమాధాన మిచ్చితిని. అతఁడు తిరిగిపోయి కూర్చుండెను. షూవను సహజముగ మంచివాఁడని తెలిసికొంటిని.

# 8

సముద్ర వాతావరణ మంతయుఁ బ్రతికూలముగ నుండెను. అందువలన వారము దినములు గడచినను నోడ ముందుకు సాగిపోలేదు. కొన్ని దినములు వెనుకకుఁ బయనము కలసి వచ్చెను. ఓడ దక్షిణ దిశగాఁ బోవుచుండెను.

పదవ దినమున సముద్రమంతయుఁ బొగ మంచుచేఁ గప్పఁబడియుండెను. ముందున్న వస్తువులేవియుఁ గనఁబడుట లేదు. అందఱును నోడ కెట్టి ప్రమాదము సంభవించునో యని భయపడుచుండిరి. ఆనాఁడు, రాత్రి పది గంటలకుఁ గెప్టెనుకు, రియాకుకు భోజన పదార్థము లందిచ్చుచుంటిని. అంతలో నోడ గొప్ప సవ్వడితో దేనినో కొట్టుకొనెను.

ఓడ సముద్రములోని శిలలకుఁ దగిలియుండునని రియాకు చెప్పెను. పడవ దేనినో తగులుకొనియుండునని కెప్టెను అనెను. ఇరువురును దొందరగా బయటకుఁ బోయిరి. కెప్టెను చెప్పినదే నిజమాయెను. మా యోడ యొక పడవకుఁ దగులుట వలనఁ బడవ— యందలి మనుజులతో సముద్రపు టడుగునకుఁ బోయెను. ఒకఁడుమాత్ర మదృష్టవశమున మిగుల సాహసముతోఁ దన ప్రాణములను రక్షించుకొనఁ గలిగెను. అతఁడు వెంటనే యోడలోనికిఁ దీసికొని రాఁబడెను. కెప్టె నాతని నధికారుల గదిలోనికిఁ దీసికొని వచ్చెను.

ఆతఁడు మిగులఁ జులుకైనవాఁడు. మంచియలవాట్లు గలవాఁడు. అతనికడఁ గొన్ని ఆయుధములుగూడ నుండెను. ఆతనిని జూడఁగనే యాతఁడు స్నేహపాత్రుఁడని తలఁచితిని.

కెప్టె నా నూతనుని నిశితముగఁ బరిశీలించెను. అతని దుస్తులు మిగుల విలువగలవి. కాని సముద్రములోఁ బడుటవలనఁ గొంత చెడియుండెను.

ఆ నూతనుఁడు కెప్టెనుతో నిట్లనియెను. "నేను క్రీ. శ. 1745 లో జార్జిరాజుకు వ్యతిరేకముగాఁ జరిగినతిరుగుబాటులో బాల్గొంటిని. ఇప్పుడు మా నాయకుఁడు ఫ్రాన్సులోనున్నాఁడు. ఆతని యనుచరులవద్ద శిస్తులు వసూలుచేసి యాతనికిఁ దీసికొని పోవుచున్నాను. నన్ను మీరు ఫ్రాన్సులో దిగవిడిచినచో మీ సాహాయ్యమునకుఁ దగిన ధనము నొసంగెదను."

తరువాత నాతఁడొక డబ్బుపటకాను దీసి యందుండి ధనమును బల్లపైఁ గుమ్మరించెను. కెప్టెను మనస్సాందోళనాపూరితమాయెను. నూతనుని వద్దఁగల ధనములో సగమిచ్చినచో నాతనిని బయలుదేరిన ప్రదేశమునకుఁ జేర్చుటకుఁ గెప్టెను అంగీకరించెను. ఆ ధనము తనదికాదనియు, నందువలన నంత ధనము నీయలేననియు నూతనుఁడు చెప్పెను. కొంత తర్జనభర్జన జరిగినతరువాత నాతఁడు అఱువది గినీనాణెముల నిచ్చుట కంగీకరించెను. కెప్టెనుగూడ నా మొత్తమును దీసికొనుటకుఁ దన సమ్మతినిఁ దెలిపెను.

కెప్టె నచటినుండి బయటకుఁ బోయినతరువాత నా నూతనుఁడు పానీయమునిమ్మవి నన్నుఁగోరెను. అందువలనఁ దాళపుచెవి తెచ్చుటకు నోడ పైభాగమునకుఁబోతిని. అచటఁ గెప్టెను, రియాకు రహస్యముగా మాటాడుకొనుచుండిరి. వారి సంభాషణను జాటుగానుండి వింటిని. అది నన్ను విభ్రాంతునిఁ జేసెను.

వారిరువురు నా నూతనుని అధికారుల గదిలోనేయుంచి, హత్యఁజేయఁదలఁచిరి.

"మన మిరువురము ఆతనిని గబుర్లలోనికి దింపి హఠాత్తుగఁ చెఱియొక రెక్క పట్టుకొని చంపుదము. లేదా ఇరువురము రెండుప్రక్కలనుండి హఠాత్తుగఁ బ్రవేశించి యాతనిని బట్టుకొని చంపుదము" అని కెప్టెను చెప్పెను.

ఆ మాటలను వినఁగానే నాకు భయముకలిగెను; కోపముగూడ వచ్చెను. వెంటనే వారి యెదుటఁబడి నేను వచ్చిన పనినిఁ జెప్పితిని. అపుడు కెప్టెను నన్నమితమగు దయతోఁ బలుకరించి యిటులనెను. "మన యోడలోనున్న నూతనపురుషుఁడు, మనకు మిగుల నపాయకరమైనవాఁడు. రాజద్రోహి. మన యాయుధసామగ్రియంతయు నాతఁడున్న ప్రదేశమునకు దగ్గఱనున్నదిగదా! మేముపోయి వాని నీవలకుఁ దెచ్చినచో నాతఁ డనుమానపడవచ్చును. నీవు కుఱ్ఱవాఁడవు. నీవేమియు నెఱుఁగనటులఁ బోయి కొన్ని యాయుధముల నీవలకుఁ దీసికొనిరావలయును. నీవు చేయు నీ యుపకారమును నేను జ్ఞప్తియందుంచుకొనెదను. అదియుఁగాక యతని పట కాలోఁగలధనమును నీవు వీలుపడినపుడు దొంగిలింపవచ్చును."

నే నటులే చేయుదునని చెప్పి, యాతఁడిచ్చిన తాళపుచెవినిఁ దీసికొని తిరిగిపోతిని. నేను వారు చెప్పినటులఁ జేయుటా లేక వారిచేత మరణమును బొందుటా యను సమస్య యుదయించెను. నేను, ఆ నూతనుఁడు గలసి మిగిలినవారి నందఱ నెదుర్కొనుట యంత లాభకారికాదని తోఁచెను. కాని హంతకులకు సాహాయ్యముఁ జేయుట కిచ్చగింపనైతిని.

నేను అధికారుల గదిలోనికిఁ బోవుసరి కా నూతనుఁడు భోజనము చేయుచుండెను. నే నాతనివద్దకుఁబోయి యధికారుల కుట్రయంతయు నివేదించితిని. ఆతనికి నా పేరును దెలిపితిని. ఆతనిపేరు స్టీవర్టు ఎలన్‌బ్రెక్ అని పిలుతురు; మే మిరువురము స్నేహితులమైతిమి.

తరువాత నా గదిని బాగుగఁ బరిశీలించి రక్షణకుఁ దగినయేర్పాట్లను గావించుకొంటిమి; ఆయుధములను సిద్ధముగా నుంచుకొంటిమి. నేనొక చిన్న కత్తినిఁ దీసికొంటిని. మాతోఁ బోరుటకు నోడపైఁ బదునైదుగురు గలరు. కాని మా రక్షణ వ్యూహమువలన వారిలోఁ బలువురను దెగటార్చి విజయమును సాధింపఁగలమని నమ్మితిమి. ఏ క్షణములోనైనను శత్రువులు మా యూహలను దెలిసికొని మాపై దండెత్తుదురని భావించి, యందులకు సిద్ధపడితిమి.

## 9

మేము భావించినట్లే యాయెను. నే నెంతకాలము నకును దిరిగి పోక పోవుటవలనఁ గెప్టెను మేమున్న గదిద్వారము వద్దకువచ్చి నిలఁబడెను. అతనిని జూడఁగనే ఎలన్ "అచ్చటనే నిలబడుము"అని హెచ్చరించెను; తన కత్తినిఁ జూపెను.

"నిన్ను దయదలచి రక్షించినందులకు నీవు చూపవలసిన కృతజ్ఞత యిదియేనా ?" అని కెప్టెను ప్రశ్నించెను.

"నీ దయ నాకుఁ దెలియును. నీవు ద్రోహివి. నీ ద్రోహమంతయు నాకుఁ దెలియును. ఇంకను ఆలశ్యమెందులకు ? పోరాటమునకు రండు. మేము పోరాటమునకు సిద్ధముగా

నున్నాము. నే నెవరనో నీకుఁ దెలియునుగదా''అని ఎలన్ హెచ్చరించెను.

కెప్టెను నా దిక్కునకుఁ జూచి "డేవిడ్, నీ మోసమును జ్ఞప్తియందుంచు కొందును'' అనెను. పిమ్మట నచ్చోటు వీడిపోయెను.

త్వరలోనే పోరాటము సంభవించునని యెంచి యాయుధముల ధరించి మా మా ప్రదేశములలో సిద్ధముగా నుంటిమి. ఎలన్ ఒకచేతిలోఁ గత్తి, మఱియొక చేతిలోఁ జాకు ధరించెను. శత్రువులుగూడ నాయుధములు ధరించి పోరాటమునకు సిద్ధమగుచున్నారను విషయమును గిటికీనుండి చూచి తెలిసికొంటిని. పోరాటము త్వరలోఁ బ్రారంభమై త్వరలో ముగిసిన బాగుండునని తలఁచితిని.

ఆ సుముహూర్త మేతెంచెను. హఠాత్తుగ నడుగుల చప్పుడు, కేకలు వినవాయెను. ఎలన్ ఒక్క అంకె వైచెను. నే నాతని దిక్కునకుఁ జూచితిని. అచట షూవను ఎలన్ పోరుచుండిరి. రేన్సమును జంపిన దాతఁడేయని యఱచితిని. ఎలన్ తన కత్తిని షూవన్ శరీరములోనికి గ్రుచ్చుటను జూచితిని.

అంతలో నైదుగురు నేనున్న దిక్కునుండి వచ్చిరి. అంతవఱకు నేను బిస్తోలును బ్రేల్చియుండ లేదుగాని యా క్షణ మునఁ బ్రేల్చితిని. అది యొకనికిఁ దగిలియుండును. తరువాత రెండు మూఁడు సార్లు ప్రేల్చితిని. అంతటితో వారు పలాయ నము చిత్తగించిరి. నేను దిరిగి ఎలన్ దిక్కునకుఁ జూచితిని.

ఎలన్ కత్తి రక్తసిక్తమై యుండెను. అతఁడు విజయుని వలె నుండెను. అతనిముందు షూవన్ పడియుండెను. అక్కడ నొక రక్తపు మడుఁగేర్పడెను. అతని నిరువురు ముగ్గురు బయటకీడ్చుకొని పోయిరి. అతఁడు త్రోవలో మరణించి యుండును. నే నొకనిని గాయపరచితిననియు, నాతఁడు క్రిందపడి యుండుననియు నెలన్‌కుఁ దెలిపితిని. తా నిరువురినిఁ జంపితినని ఎలన్ చెప్పెను.

అప్పటికిఁ బోరాటము ముగిసెను. కాని యది పూర్తిగ ముగిసెనని మేము భావింపలేదు. తిరిగి వారు త్వరలోనే సిద్ధపడి వచ్చెదరని యూహించితిమి.

ఒక యీల వినఁబడెను. అంతటితోఁ బోరాటము మరలఁ బ్రారంభమాయెను. కొందఱు మనుజులు తలుపును త్రోసికొని రాఁజొచ్చిరి. అదేసమయమున నొక నావికుఁడు పైనున్న యద్దమును బగులఁగొట్టి యా సందునుండి లోనికిఁ బ్రవేశించెను. మొదట నాతనిని పిస్తోలుతోఁ గ్రోసితిని గాని ప్రేల్చఁ జాలకపోతిని. కడకు నాతఁడు నా మీఁదకురాఁగా ధైర్యము తెచ్చుకొని ప్రేల్చితిని. అతఁడు నేలపైఁ బడెను. తరువాత మఱియొకని పైఁగూడఁ బ్రేల్చితిని.

అంతలో నెలన్ — సాహాయ్యము కొఱకుఁ గేకవైచెను. ఆ దిక్కునకుఁ జూచితిని. ఎలన్ పోరుచుండగాఁ నొక శత్రువు దొంగచాటున వచ్చి యాతనిఁ బట్టుకొనెను. ఎలన్ అతనిని జాకుతోఁ బొడుచుచుండెను గాని యాతఁడు పట్టు వీడకుండెను. నే నాతనివద్దకు దుమికితిని. అప్పటికే ఎలన్ శత్రు

వును బడఁగొట్టి అంకె లిడుచు వీరవిహారము చేయఁజొచ్చెను. ఆతనిచేతఁ గల కత్తి తళ తళ మని మెఱయుచుండెను. ఆతని ధాటి కాగలేక శత్రువులు చెల్లాచెదరైరి.

ఎలన్ నావద్దకు వచ్చి నన్ను గాఢముగఁ గౌఁగలించుకొని నా సాహాయ్యము నెంతయు నభినందించెను. తరువాత నచ్చటఁ బడియున్న నలుగురు శత్రువులను బయటకీడ్చివైచెను. తన విజయమును జాటుచుఁ బద్యములఁ బాడఁ జొచ్చెను. మధ్య మధ్య నన్నుఁగూడఁ బొగడుచుండెను.

పిమ్మట నేను నిదురపోతిని. అప్పుడు ఎలన్ కాపుండెను. మూఁడు గంటలు నిదురపోయిన తరువాత నెలన్ నన్ను లేపెను. అప్పుడాతఁడు నిదురపోయెను. నేను గాపుంటిని. అంతలోఁ దెల్లవాఱెను.

## 10

గది యంతయు రక్తసిక్తమై యుండెను. గాజు ముక్కలు చెల్లాచెదురుగఁ బడియుండెను. కాని మేము మంచి యుల్లాసముగ నుంటిమి. ఓడయధికారుల నోడించి, విజయమును గైవసము చేసికొన్న మాకు ఆనందము దక్క మఱి యేమియుండును ? మా యిచ్చవచ్చిన యాహార పదార్థముల భుజించుటకును, పానీయములను సేవించుటకును వీలుకలిగెను. ఇంకఁ గెప్టెనుకు, రియాకుకుఁ ద్రాగుటకు మంచినీరు దక్క మఱి యెట్టి పానీయమునులేదు. అది మా కపరిమితానందమును గలుగఁజేసెను.

వారిరువురును ద్రాగుడు లేకుండ నెంతో కాలముండ లేరనియుఁ ద్వరలోనే వారు రాజీకి వచ్చెదరనియు ఎలన్ ఊహించెను.

మే మిరువురము నుదయకాలపు భోజనమును దీసికొనుచు సంతోషముగాఁ గాలమును గడపసాగితిమి.

ఎలన్ తన కోటునకున్న వెండి గుండీనిఁ జాకుతోఁ గోసి నాకిచ్చి యిటులనెను." ఈ గుండీలను నా తండ్రి నాకిచ్చినాఁడు. వానిలో నొకదానిని నీకిచ్చుచున్నాను. దీనిని బట్టి నిన్నెంతటి యాప్త మిత్రుఁడుగా భావించుచున్నానో యర్థము చేసికొనఁగలవు. దీని నానవాలుగాఁ జూపినచో నా స్నేహితు లెచ్చటనున్నను నిన్ను గారవింతురు. నీకుఁ గావలసిన సౌకర్యములను సమకూర్తురు."

ఆతని యభిమానమును నే నెంతయు నభినందించితిని. ఆతఁడనిన నాకు సదభిప్రాయ మంతకంతకు హెచ్చసాగెను. ఆతఁడిచ్చిన గుండీని ఎంతో విలువైనదిగా దాఁచుకొంటిని.

అంతలో నోడ పై భాగమునుండి రియాకు మాట వినఁబడెను. మాతోఁ గొన్ని విషయములు మాటాడవలసి యున్నదని యాతఁడనెను. నేను జేతఁ బిస్తోలును ధరించి యిదివరకు నద్దము పగులఁగొట్టఁబడినచోటికిఁ బోతిని. రియాకు, నేను, ఒకరి మొగమొకరము కొలఁది కాలము చూచుకొంటిమి. రియాకనిన నాకు మొదటినుండియు మంచి యభిప్రాయమే యేర్పడియుండెను.

రియాకు పోరాటమున నంతగాఁ బాల్గొని యుండలేదు. అందువలన నాతని కెచ్చటను దీవ్రమగు గాయములు తగుల

లేదు. కాని యతఁడు మిగుల నలసియుండెను. ఏలయన నతఁడు గడచిన రాత్రి యంతయుఁ దగిన భోజనము లేకుండ నుండెను. మంచి పానీయములు గూడ సేవింపలేదు. రాత్రి యంతయుఁ గాపలాగూడ నుండవలసివచ్చెను

రియాకే సంభాషణ ప్రారంభించెను. జరిగిన దంతయు వ్యర్థముగా జరిగినదని యతఁడు వాక్రుచ్చెను. "అది మీరు చేసికొన్న దే" అని యంటిని.

"కెప్టెను మీతో మాటాడఁదలచు చున్నాఁడు" అని రియాకు చెప్పెను.

"మీరు మరల మోసము చేయఁదలఁచు చున్నారు. మీ నక్కజిత్తుల నిచ్చట నమ్మువా రెవరును లేరు" అని యంటిని.

"మోస మేమియు లేదు. ఒకవేళ నతఁ డేదైన మోసమును దలపెట్టినను నతని మాటను వినువా రొక్కరును లేరు. నేను వినను. ఆతనిని వదలించుకొనఁ జూచుచున్నాము" అని చిఱునగవుతో రియాకు నమ్మబలికెను.

రియాకు కోరికపై నాతని కొక పానీయమును గూడ నిచ్చితిని. అందుల కాతఁ డెంతయు సంతసించెను.

నేను, ఎలన్ కొంతసేపు సంభాషించుకొంటిమి. తరువాత మేము కెప్టెనుతో మాటాడుట కిచ్చగించుంటిమని రియాకుఁ దెలిపితిమి. రియాకు ఆ సందేశమును దీసికొనిపోయి కొంతసేపటికిఁ గెప్టెనుతోఁ దిరిగి వచ్చెను.

ఎలన్ కెప్టెను దిక్కునకుఁ బిస్తోలు గురిపెట్టి చూచిపెట్టెను. దానిని దీసివేయవలసినదిగాఁ గెప్టెను కోరెను. "నీవు దురాత్ముఁడవు. నీకు మాట నిలకడలేదు. నిన్న నీవుచేసిన నీచమైన మోసమింకను జ్ఞప్తియందున్నది" అని ఎలన్ జవాబిచ్చెను.

అంతఁ గెప్టెను ఇట్లనెను. "మీరంతయుఁ బాడుచేసినారు. ఇప్పుడు ఓడను ముందుకుఁ బోనిచ్చుటకుఁ దగినంత మంది నావికులులేరు. కనుక నేను దిరిగి గ్లాస్గోకుఁ బోయి నావికులను సేకరించవలసియున్నది."

"నన్ను, మన మనుకొన్న ప్రదేశమునకుఁ దీసికొని పోవలసినదే" అని ఎలన్ అనెను.

"మీరనిన తీరము మిగుల నపాయకరమైనది. ఇచ్చట దాని విశేషములు తెలిసినవారులేరు" అని కెప్టెను జవాబిచ్చెను.

"నాకదంతయుఁ దెలియదు. నీవు నా ప్రదేశమునకు సమీపమున నెచ్చటనైనను దింపవలసినదే" అని ఎలన్ తిరిగి కోరెను. తరువాత నతఁడు కెప్టెనుకు మంచిరకపు పానీయమును నొకదాని నిచ్చెను.

# 11

ఎలన్, నేను గదిలోఁ గూర్చుండి కబుర్లు చెప్పుకొంటిమి. నా పూర్తి కథ ఎలన్‌కుఁ జెప్పితిని. ఎలన్ తన కథను నాకుఁ జెప్పెను. ఎలన్ నోటినుండి స్కాట్లండు మిట్ట

ప్రదేశములకుఁ జెందిన విషయమును దెలిసికొనుట మిగులఁ గుతూహలముగ నుండెను.

నేనే మొదట నా కథను బ్రారంభించితిని. నా దురదృష్ట జీవితమంతయు సావధానముగావిని యాతఁడు తన సానుభూతిని వెలిపుచ్చెను. తరువాత నాతఁడు తన తండ్రినిఁ గూర్చిన యొక చిన్న విషయము నిటులఁ జెప్పెను.

"మా మిట్టప్రదేశములవారము కత్తి యుద్ధమున మిగులఁ బ్రసిద్ధిఁ జెందినవారము. జార్జిరాజు దానిని జూడఁ దలచి నా తండ్రిని, మఱి ముగ్వురను బిలిపించెను. వారు రెండు గంటలు తమ విద్య నమోఘముగఁ బ్రదర్శించిరి. రాజు, రాణి, మఱి యనేక ప్రముఖులు చూచి యానందించి మెచ్చుకొనిరి. చివరకు రాజు వారితోఁ జక్కఁగా మాటాడి యొక్కొక్కనికి మూఁడు గినీ నాణెముల నిచ్చెను. వారు రాజ భవనమునుండి బయటకు వచ్చునప్పుడు కడపటి ద్వారము వద్ద నొక కాపలావాఁ డుండెను. ఆతనికి డబ్బు నిచ్చుట యాచారమనుకొని నా తండ్రి తన వద్దనున్న మూఁడు గినీ నాణెములను నతని కిచ్చివైచెను. మిగిలిన ముగ్వురును నట్లే యొనర్చిరి. నా తండ్రి యంతటివాఁడు!"

"నీవు చెప్పిన కథనుబట్టి చూడఁగా నీ తండ్రి నీ కేమియు మిగల్చలేదని తోఁచుచున్నది. ఏమందువు?" అని యంటిని.

"నిజమే. నా కాతఁ డేమియు మిగల్చలేదు. కాని నే నెన్నఁడు నందుఁ గూర్చి విచారింపలేదు. నా వద్ద ఫ్రాన్సు

రాజు శత్రువులు కొన్ని కలవు. అవియున్నంతవఱకు నాంకేటి భయమును లేదు. డబ్బునకుం గొదువలేదు" అని ఎలన్ సమాధాన మిచ్చెను.

తరువాత నాతం డప్పుడప్పుడు ఫ్రాన్సునుండి స్కాట్లండున కెందులకు వచ్చుచున్నదిని వివరించెను.

"ఫ్రాన్సు రాజు వద్దం బనిచేయుటకుం గొందఱు పనివాండ్రను దీసికొని పోవుచుందును. అందువలనం గొంత ధనము లభించును. ఫ్రాన్సులో నెల్లప్పుడుండుట విసుగుదలగా నుండును. అందువలన మార్పుకొఱ కప్పుడప్పుడిచటకు వచ్చుచుందును. ఇంతకంటె మఱియొక ముఖ్యమగు కారణము గలదు. మా నాయకుండు అర్డుషీల్. అతండు ఫ్రాన్సులో నున్నాండు.

ఒకప్పుడాతండు చాల గొప్పవాడు. ఆస్తిపరుడు. రాజులకు సింహ స్వప్నమువలె నుండెడివాండు. అతండిప్పుడు ఫ్రాన్సులో బికారియై యున్నాండు. ఇంకను ఫ్రాన్సులో ననేకమంది తిరుగుబాటుదారుల పుత్రులున్నారు. వారందఱకు విద్యను నేర్పింపవలెనుగదా. అందువలన నిచ్చటంగల కొందఱు రైతులు రాజునకు శిస్తును జెల్లించుటయే గాక, ఫ్రాన్సులోని మా నాయకునకుం గూడ శిస్తును జెల్లింతురు. ఆ ధనమును దీసికొని పోవుటకుంగూడ నేనప్పుడప్పుడు వచ్చుచుందును.

ఇక 'ఎఱ్ఱనక్క'ను గూర్చి చెప్పెదను వినుము. క్రీ. శ. 1745 లో రాజుపై దిరుగుబాటు విఫలమైనప్పుడు, తిరుగుబాటుదారులు చెల్లాచెదరైరి. మా నాయకుండు అర్డుషీల్

సర్వమును ద్యజించి పర్వతములలోనికిఁ బరుగె త్తెను. ఆతనిని దరువాత ఫ్రాన్సునకుఁ జేర్చితిమి. ప్రభుత్వమువా రాతనిని బట్టఁ జాలక యాతనికి దేశములోఁగల సర్వహక్కులను రద్దుచేసిరి. ఆస్తులను వశపఱచుకొనిరి. కాని రైతులుమాత్రము నాయకు నకు శిస్తులు చెల్లించుట మానలేదు.

కొలిన్ రాయి అను కాంబెల్ రాజుతరపున రైతులనద్ద శిస్తులు వసూలుచేయుటకు నియమింపఁబడెను. రైతు లాతనికి సరిగనే శిస్తులు చెల్లించుచుండిరి. కాని వారు తమ నాయకు నకుఁగూడ శిస్తులు చెల్లించుచుండిరను విషయ మాతనికిఁ దెలిసెను. అది యాతఁడు సహింపలేకపోయెను. భూములను దిరిగి వేలము వేసెను. ఇదివఱకుఁగల రైతులే హెచ్చు మొత్త ములకుఁ బాడిరి. అప్పు డాతఁడు నిస్సహాయుఁడాయెను. కాని యాతఁడు మా నాయకుని మూఢ్ఛేదలఁచెను. అందువలన నాతఁడు బూజుపట్టిన పత్రములను వెదకి తెప్పించి, న్యాయ వాదుల కప్పగించి, రైతులను భూములనుండి వెడలఁగొట్టుటకుఁ దగిన ప్రయత్నములఁ జేసెను. ఆతఁడు నాకంటఁ బడినచో దప్పక తగిన శాస్తిఁ జేయుదును."

# 12

అర్ధరాత్రి యాయెను. కెప్టెనువచ్చి దారిసరిగాఁ దెలి యుటలేదని చెప్పెను. అందేదైన మోసము గలదేమోయని మొదట ననుకొంటిమి; గాని యాతని ముఖమును జూచిన తరు వాత మోసమేమియు లేదని తలంచితిమి. నేను, ఎలన్ ఓడ పైభాగమునకుఁ బోతిమి.

సముద్రమంతయు నల్లకల్లోలముగా నుండెను. దారి యంతట శిలలుండెను. ఏ క్షణమునైనను నోడ యా శిలలకుఁ దగిలి ముక్కలగునేమో యనునట్లుండెను. కాని కెప్టెను, రియాను మిగుల ధైర్యముతో నడపుచుండిరి. పోరాటమునఁ దన యాధిక్యతను జూపిన ఎలన్ ముఖమున రక్తపుచుక్క లేకుండెను. ఆతఁడు తన ప్రాణముల నరచేతఁ బెట్టుకొని యుండెను.

ఒకప్పుడు ఓడ యొక పెద్ద యలచేఁ దట్టఁబడెను. ఆ యూపునకు నోడపోయి యొకశిలను దాకెను. దైవవశమున నోడ ముక్కలుకాలేదు. నిలఁబడినవార మందఱము క్రిందఁ బడితిమి. అంతయు నయోమయముగా నుండెను.

ఇఁక నోడకుఁ బ్రమాదము తప్పదని నిశ్చయించిరి కాబోలు; రియాను మున్నగువారందఱు నోడలో మధ్యభాగమున నున్న పడవను గ్రిందకు దింపి సిద్ధముచేయుటలో నిమగ్నులై యుండిరి. నేనును వారికి సాహాయ్యము చేయఁబూనితిని. కాని యది మిగులఁ గష్టసాధ్యమైన పనిగానుండెను. పనిచేయుటకు శక్తిగల నావికులెల్లరును సాయపడఁజొచ్చిరి.

కెప్టెను ఆశను వదలుకొనెను. అతఁడు నిశ్చేష్టుఁడాయెను. మేము పనిచేయుచు సముద్రపరిస్థితినిఁ గనిపెట్టి యుండవలసినదని యొక గాయపడినవానిని నియమించితిమి. మేము పడవను గ్రిందకు దింపుటకు సిద్ధముగా నుంటిమి. అంతలో "జాగ్రత్త, జాగ్రత్త" యను కేకలు వినఁబడెను. అది

సాధారణమైన హెచ్చరిక కాదని యాతని గొంతువలన గ్రహించితిమి. సముద్ర మొక్కపరి యుప్పొంగి యోడను బోర్లగిలవైచెను. నేను దూరముగా సముద్రములోనికి విసరఁబడితిని.

సముద్రములో నెన్నిసార్లు మునిఁగి తేలితినో చెప్పఁజాలను. అంతలో నదృష్టవశమున నొక దుంగ నావద్దకుఁ గొట్టుకొనివచ్చెను. నేను దానిని గట్టిగాఁ బట్టుకొంటిని. ఓడ కొఱకుఁ గేకవైచితిని. కాని నాకెట్టి సమాధానమును రాలేదు. ఇఁక దైవముపై భారమువైచి యా దుంగ నతికష్టముతో ముందుకు నెట్టుకొని పోసాగితిని. అది మిగులఁ గష్టముగా నుండెను. కాని ప్రాణరక్షణకై యా శ్రమను లెక్కచేయనైతిని.

ఒక గంటసేపాయెను. నా యదృష్టము ఫలించెను. సముద్రపు టొడ్డువచ్చెను. దుంగను వదలివైచి, యిసుకపై నడువసాగితిని. దయామయుఁడగు దేవునకు నా కృతజ్ఞతను దెల్పితిని.

## 13

తెల్లవారెను. ఒకకొండపై కెక్కి యంతయుఁ గలయఁ జూచితిని. ఎక్కడను నోడజాడగాని, పడవజాడగాని కాన్పింపలేదు. ఇఁక నా ప్రదేశమున నిండ్లు, మనుజులు గలరేమో యని పరిశీలించితిని; గాని నా శ్రమయంతయు వృథాయయ్యెను. అచట నున్నది నేనొకఁడనే యని తలఁచినపుడు నన్నావహించిన భయము వర్ణనాతీతము.

దీవిపైఁ బ్రయాణము చేయుచుండఁగా నొకచోఁ బ్రవాహ మడ్డువచ్చెను. ఒడ్డుననే పడి ముందుకుఁ బోతిని. కడకు నలువైపుల నేరుకలదని గ్రహించితిని. అంతలో నే నిది వఱకుఁ బడినపాట్లు చాలవనినటుల వర్షము ధారాపాతముగఁ గురియఁజొచ్చెను. చలికి గడగడ వణకఁజొచ్చితిని. దుఃఖముచేఁ గండ్ల వెంబడి నీరు కాఱఁజొచ్చెను. దీవిలోఁ బొడిభాగ మెచ్చటను గనఁబడకుండెను.

రెండవ దినమున దీవియంతయుఁ దిరుగఁజొచ్చితిని. అల్లంతదూరమున నిండ్లు, పొగ కాన్పింపఁజొచ్చెను. కాని యేమి లాభము? నే నీ దీవిని వదలు సాధనము గానరాకుండెను. కాని నే నెట్లయినను జీవించితీరుదునను నమ్మకము కలుగుచుండెను.

మూఁడవదినమున నా జేబులో నేబదిపౌనులకు బదులు, మూఁడుపౌనుల నాలుగుషిల్లింగు లున్నవిషయమును గ్రహించితిని. ఒక యెత్తైన గుట్టనెక్కి దుస్తుల నాఱబెట్టుకొనుచుంటిని. అంతలో సముద్రమున నొక పడవ కాన్పించెను. అందుఁగల యిరువురు మనుజులనుగూఁడ జూచితిని. వారు నేనున్న ప్రదేశమునకు దగ్గఱగా వచ్చిరి. నేను గట్టిగా నఱచితిని. సంజ్ఞలు చేసితిని. వారు ననుఁజూచిరి. నవ్విరి. ఏమో మాటాడుకొనిరి. కాని నాకు రవ్వంతయు సాహాయ్యము చేయకయే ముందునకుఁ బోయిరి.

నాలుగవ దినమున నా పడవయే నన్ను సమీపించెను. అందీసారి క్రిందటి దినమునఁగల యిరువురు మనుజులు గాక

మూడవవాఁ డొకఁడుండెను. నన్ను వారి పడవలోనికిఁ దీసి కొని పోవలసినదని ప్రార్థించితిని. వారు నవ్వుకొనిరి. మూత నుఁడు నాతో మాటాడఁ జొచ్చెను అతని భాష వేఱు. ఎట్టకేలకు నేను గొన్నిమాటల నర్థముచేసుకొనఁ గలిగితిని. నాకు జ్ఞానోదయ మాయెను.

వెంటనే దీవి యాగ్నేయ మూలకుఁ బరుగెత్తితిని. ఆశ్చర్యము! మున్ను కనఁబడినచోట నీటి ప్రవాహము లేకుండెను. నేను మొదటఁ జూచినపు డచట సముద్రపు పోటు వలన నీరుండెను. ఇప్పుడాపోటు తగ్గుటచే నేల కనఁబడు చుండెను. నేను దానిపైఁగా నడచిపోయి మల్ దీవినిఁ జేరితిని.

# 14

మల్ దీవిలోఁ జాలసేపు ప్రయాణముచేసి యొక గృహమును జేరితిని. ఆ గృహమును జేరుట నా యదృష్టమని యే చెప్పవలెను. ఆ గృహ యజమాని నా వద్దఁగల వెండి గుండీనిఁ జూచి యోడ ప్రమాదములోఁ జిక్కుకొన్న వారందఱు సురక్షితముగ నున్నారని తెలిపెను. అందు నెలన్ కూడఁ గలఁడని తెలిసికొని సంతసించితిని.

ఆ గృహ యజమాని తెల్పిన సమాచారము వలన టారొసే యను ప్రదేశమునకుఁ బయలుదేఱితిని. టారొసేకు మార్గమును జూపువాఁడొకఁడు నన్ను మోసము చేయనెంచెనుగాని నేనాతని వలలోఁ జిక్కలేదు. కఱ్ఱ సాహాయ్యమున నడచుచున్న యొక గ్రుడ్డివాఁడుగూడ నన్ను మోసపుచ్చ నెంచెనుగాని సఫలీకృతుఁడు గాలేదు.

ఎట్టకేలకు నేను టారొాసే చేరితిని. ఎలన్‌కూడ నచటకు వచ్చి తన యూరికిఁ బోయెనని యచ్చటఁగల పడవవాండ్ర వలనఁ దెలిసికొంటిని. ఎలన్ నన్నా పడవ వాండ్రకు వర్ణించి చెప్పియుండెను. అందువలన వారు నన్ను గుర్తించి యా విషయమును నాకుఁ దెల్పిరి. పడవపైఁ బ్రయాణము చేసి స్కాట్లండు ప్రధాన భాగమును జేరితిని. అటు పిమ్మట నెలన్ కల ప్రదేశమునకుఁ బయనమైతిని.

త్రోవలో నొక మతాధికారినిఁ గలసికొంటిని. అతని పేరు హెండర్లెండు. అతఁడు చూచుటకుఁ జాల మంచివాని వలెఁ గన్పట్టెను. తరువాత నా యభిప్రాయము నిజమని తేలెను. మే మిరువురమును గలసి ప్రయాణము చేయసాగితిమి. త్రోవలో నాతఁ డందఱనుబలుకరించుచుండెను. ఆ ప్రాంతముఁ వారి కందఱకు నాతఁడు మిగుల నిష్టుఁడుగాఁ గన్పట్టెను. ఆతఁడు నా ప్రశ్నలు కొన్నింటికి సమాధానముగా నిటులఁ జెప్పెను.

"ఈ స్కాట్లండు మిట్టభూముల ప్రజలు దోపిడీలు, హత్యలు చేయుదురు. జార్జిరాజు ప్రతినిధియగు కొలిన్ కాంబెల్ అనిన వారికి మిగుల ద్వేషము. కాంబెల్ ఇచటి ప్రజలకు మిగులఁ గఠినుఁడుగా గన్పట్టును. కాని యతఁడు రాజభక్తుఁడు. ఎలన్ బ్రెక్ అనువాఁడు ఇచటి ప్రజలకు నాయకుఁడు. అతఁడు సింహాసన చ్యుతుఁడైన రాజునకుఁ గుడిభుజము వంటివాఁడు. అవసరము వచ్చినచో నతఁడు దోపిడిగాఁడు. హంతకుఁడు నగును. తన స్వామికార్యమును నెరవేర్చుటలో

...ములను లెక్క చేయడు. అతనివద్దనుండి నేర్చు...నన విషయములు చాలఁగలవు. అతఁడు చాల తెలి...నవాఁడుగూడ. జార్జిరాజు సైనికు లాతనిని బట్టుకొనుటకు శతవిధములఁ బ్రయత్నించుచున్నారు; గాని యేమియు లాభించుటలేదు. అతఁడిపు డిచటనుండును. మఱికొన్ని క్షణము లలోఁ గొన్ని మైళ్ళదూరమున నుండును. అతఁడిప్పు డెచటనో పొంచియుండి మన సంభాషణల నాలకించుచున్నను మన మాశ్చర్యపడవలసిన పనిలేదు.

కొంతతడవైన పిదప నాతఁడు తన యింటికిఁబోయెను. నేను ముందుకుఁ బోసాగితిని. కొన్నిదినము లెక్కడను నాగకుండ నడచితిని. అందువలన నలసి యొకచో విశ్రమించితిని. కొలఁదిదూరమునఁ గొందఱు సైనికులు గాన్పించిరి. సైనికులఁ జూడఁగనే నాకు రకరకముల యభిప్రాయములు గలిగెను. నేను ఎలన్‌ను గలసికొనఁ బోవుచుంటిని. అతఁడేమో రాజ ప్రతినిధినిఁ జంపుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు. సైనికు లాతనిని బట్టుకొన్నచోఁ దప్పక యురిదీయుదురు. ఎలన్ అందుల కెల్లప్పుడును సిద్ధముగనే యున్నాఁడు. ఆతని సహవాసమున నేనున్నచో నాకుఁగూడ నట్టిగతియే పట్టవచ్చును. అందువలన నాతనికొఱకుఁ బోవు యత్నమును వదలి నా గ్రామమునకుఁ బోవలెనని తలఁచితిని.

అంతలో నేనున్నచోటికిఁ గొందఱు మనుజులు రాసాగిరి. వారు రాజోద్యోగులనియు, నందొకఁడు 'ఎఱ్ఱనక్క'యను హాస్యనామముగల కొలిన్ కాంబెల్ అనియుఁ దలఁచితిని.

అటులేల దలంచితినో నాకే తెలియదు. న
మావహించెను. కాని త్వరలోనే ధైర్య మేర్పడి భయ
నే నెవరో నూతనుఁడనని తెలుపుటకై కోలిన్ కా
యేదోయొక ప్రదేశమునకు మార్గమడిగితిని. అతఁడేదో స
ధానము చెప్పఁబోయెను. అంతలోఁ బిస్తోలుమ్రోత విన
నాయెను. కోలిన్ కాంబెల్ ఱొమ్ముభాగమున దెబ్బతగిలెను.
వెంటనే యతఁడు నేలఁబడి మరణించెను. భటు లీలలువైచిరి.
సైనికులు పలువురేతెంచిరి. అందఱును హంతకుని వెదుకఁ
జొచ్చిరి. నేనును వారి వెంటఁ బడితిని.

అంతలో నొక పొదలో నొక మానిసి కదలిక చూచి
తిని. 'అడుగో, హంతకుఁడు' అని యఱచితిని. వెంటఁబడి
తిని. కాని యతఁడు గబగబ పరుగెత్తుకొని పోయెను. నేనును
ముందుకుఁ బరుగెత్తి సాగితిని. హంతకుఁడింక నాకుఁ గనఁ
బడకుండ పోయెను. నన్ను వెనుకకు రమ్మని రాజోద్యోగులు
కేకలువైచిరి. వారినే ముందుకు రమ్మంటిని. అంత వారిలో
నొకఁడు సైనికులతో నిట్లనెను. "పొండు, ఆ కుఱ్ఱవాఁడు
హంతకుని యనుచరుఁడు. మనల ననవసరముగా నాపుచేసి
నాఁడు. పట్టుకొనుఁడు."

ఆసమయముననే నా ప్రాణములు పోయెనని తలంచితిని.
అంతలో నొక పొదచాటునుండి "ఇటురమ్ము" అను కేక
వినఁబడెను. నే నచ్చటకుఁ బోతిని. ఎలన్‌బ్రెక్‌ను జూచితిని.
వెంటనే మే మిరువురమును ప్రాణ రక్షణార్థము పరుగెత్తి
సాగితిమి.

ఎలన్ బ్రెక్‌ను జూడఁగనే హత్యచేయఁ బడినవాడు కొలిన్ కాంబెల్ అను నా నమ్మకము నిరాధార మాయెను. హత్య చేసినది ఎలన్ అని గూడ నే ననుమానించితిని. తరువాత నతఁడు హంతకుఁడు కాదని తెలిసెను.

నేను, ఎలన్ పరుగెత్తుచు ననేక కష్టములు పడితిమి. మమ్ము సైనికులు తరుమఁ జొచ్చిరి. అందువలన వారికంటఁ బడకుండ నప్పుడప్పుడు పొదలమాటునను, గొండల చాటునను దాఁగుకొనఁ జొచ్చితిమి. అప్పుడప్పుడు ప్రాకుచుకూడ నుంటిమి. మా ప్రాణములను రక్షించుకొనుటకు మే మెట్టి కష్ట కార్యమైనను జేయుటకు సిద్ధముగా నుంటిమి.

ఎలన్ అప్పుడపుడు తలయెత్తి రాజసైనికులకుఁ గనఁబడుచుండెడివాఁడు. సైనికులు నిజముగా హత్యచేసినవానిని బట్టుకొనకుండునటుల నెలన్ పన్నిన పన్నాగ మది. సైనికులు ఎలన్‌నే హంతకునిగా భావించి వెంబడింపఁజొచ్చిరి. ఈ లోపల నిజమైన హంతకుడు పారిపోవుట కవకాశము కలిగెను.

నాకు నెలన్‌పైఁ గోపముకలిగెను. "నీవు హత్యచేయుటలో హంతకునకు సాహాయ్యము జేసితివి. ఇప్పుడాతఁడు పట్టుబడకుండఁ దప్పించుకొనిపోవుటకు సాహాయ్యము చేయుచున్నావు ఇది యనుచితము" అని యంటిని.

"హత్య చేయుటలో హంతకునకు నే నేమాత్రమును సాహాయ్య పడలేదు. అస లతఁడు హత్యచేయునని కాని, యతఁడచటఁ గలఁడని కాని నాకుఁ దెలియదు. ఇప్పు డతఁడు తప్పించుకొని పోవుటకు మాత్రము సాహాయ్య పడుచున్నాను.

ఇందు తప్పేమియు లేదు. ఒకవేళ నేను హత్యచేసియుండినను, నతఁడు నాకు సాహాయ్యపడి యుండెడివాఁడు" అని ఎలన్ బదులు పలికెను.

ఏది యేమైన నేమి? రాజసైనికులు మే మిరువురమును హంతకుల మని భావించుచున్నారనుటలో నిసుమంతయు సందియములేదు. మేము గొప్ప యపాయమునకు లోనై యుంటిమి. దైవముపై భారము వైచి తప్పించుకొనఁ జొచ్చితిమి.

## 15

స్కాట్లండు మిట్ట భూములనుండి దక్షిణ దిశకుఁ బోసాగితిమి. ఎంతదూరము నడచితిమో చెప్పఁజాలను. ప్రొద్దుపోవుటకై యనేకవిషయములను మాటాడుకొనఁ జొచ్చితిమి. ఓడ సముద్రమున మునిఁగిన తరువాత జరిగిన విషయముల నాతనికిఁ బూసగ్రుచ్చినటులఁ జెప్పితిని. ఎలన్ తన కథను నాకుఁ జెప్పెను. నే నెటులయినను రక్షింపఁబడుదునని యతఁడు భావించెను. అందువలన నే యాతఁడు నా విషయమును త్రోవలోఁ బలువురకుఁ దెలిపెను.

త్రోవలో నెలన్ మిత్రుఁడగు జేమ్సు స్టీవర్టు గృహమున బస చేసితిమి. స్టీవర్టంతకుమున్నే 'ఎప్పినక్కు' హత్యను గూర్చి వినియుండుటచే మా రాకవలనఁ దనకేమైన నపాయము గలుగునని భయపడెను. అందువలన నాతఁడు మాకుఁ గొంత ధనమును, గొన్ని బట్టలనుఇచ్చి త్వరలో నటనుండి పంపివైచెను.

తరువాతఁ ద్రోవలో రెండు వెడల్పగు ప్రవాహములను సాహసముతో దాటితిమి. కాని దురదృష్టవశమున నపాయకరమగు స్థలమును జేరితిమి. సర్వనాశనమైనదని ఎలన్ వాపోయెను. కాని యంతలో దైవమునకు దయకలిగెను. రెండు కొండలు పైభాగమునఁ గలసియుండెను. మేమచటకుఁబోయి సూర్యాస్తమయము వఱకు దాగితిమి. సైనికులా భాగముల నన్నిఁటిని వెదకిరిగాని మమ్ము చూడలేదు.

సూర్యుఁ డస్తమించిన తరువాతఁ దిరిగి ప్రయాణము ప్రారంభించితిమి. కొన్ని రోజులైన పిదప నొకయెడారి ప్రదేశమును జేరితిమి. అచట నొక వృక్షముక్రింద విశ్రమించి యపాయమున కల్లంతదూరములో నుంటిమి. కాని దానిని ముందే గుర్తించుటచే సైనికులకంటెఁ బడకయే, ప్రాకి, యొక సురక్షిత స్థానమును జేరితిమి. అచటనుండి బయలుదేఱి పోవు చుండఁగాఁ బొదల మాటుననున్న మనుజులు మాపైఁబడి చంపఁబోయిరి. వారిని ఎలన్ గుర్తించెను. వారు ఎలన్ మిత్రుఁడగు క్లునీ అనుచరులు. వారు మమ్ములను గారవించి క్లునీ గృహమునకుఁ దీసికొనిపోయిరి. అచట నాల్గు దినములు విశ్రాంతి తీసికొంటిమి.

పిమ్మట మరలఁ బ్రయాణము సాగించితిమి. త్రోవలో మేమిరువురమును నొకరి నొకరు చంపుకొనుటకు సిద్ధపడితిమి. ఏలయనఁ గ్లునీయింటివద్ద నెలన్ నా డబ్బంతయుఁ జీట్లాటలోఁ బెట్టి పోఁగొట్టెను. అందులకు నేను గోపించితిని. ఎలన్ నా పట్లఁ గార్పణ్యము వహించెను. కాని ఘనుఁడు, ఉదార

హృదయుఁడు నగు నెలన్ చివరకు మరల నా పట్ల స్నేహభావ మును బ్రకటించెను.

ఒకచో నేను జబ్బుపడి ముందుకుఁ బోవఁజాలకపోతిని. ఎలన్ నన్ను మోసికొని తన మిత్రునియింటికిఁ దీసికొని పోయెను. అచట నేను నెలదినములు జబ్బుతో నుంటిని.

నేను జబ్బునుండి కోలుకొనిన తరువాతఁ దిరిగి ప్రయాణము చేసితిమి. కడకు ఫర్తుసముద్రశాఖను జేరితిమి. దాని కావలియొడ్డుననే నా యాస్తియంతయుఁ గలదు. కాని సముద్రమును దాఁటుటకు మా వద్ద డబ్బులేకుండెను. ఎలన్ ఉపాయమున నచటఁగల యొక సత్రపుయజమాని కొమారితకు నా యందు దయకలుగునటులఁ జేసెను. ఆమె యా రాత్రి దొంగతనముగా మమ్ముల నొక పడవపై నెక్కించుకొని ఫర్తు సముద్రశాఖ కావలియొడ్డున దిగవిడిచెను.

## 16

త్తెల్లవాఱెను. ఎలన్‌ను ఒకచో నుండనియమించి న్యాయవాదియగు రాన్‌కీలరును గలసికొంటిని. అతనికి నా చరిత్రయంతయుఁ దెల్పితిని. అతఁడు సావధానముగా దాని నాకర్ణించెను. పిదప నాతఁడు నాతో నిట్లనెను. "నీ తండ్రి ఎబెనజరుకంటెఁ బెద్దవాఁడు; చట్టప్రకార మాస్తియంతయు నీదే. నీ పినతండ్రి, నీ తండ్రిని మోసపుచ్చినాఁడు. అటులనే నిన్నును మోసపుచ్చఁదలఁచుచున్నాఁడు."

...యమును గోరితిని. నాకు ... కారు... ...కరించెను. ఎబెనజరు నన్ను ...సము చేసెనను విషయము నాతఁడు స్వయ ...పురు సాక్షులయెదుట నంగీకరించునటులఁ జేయుదు నని చెప్పితిని.

రాత్రి పదిగంటలకు నేను, ఎలన్, రాన్‌కీలరు, అతని గుమాస్తా, ఎబెనజరు ఇంటికిఁబోతిమి. ఎలన్ తప్ప మిగత వారము రహస్యముగా నొకచో నుంటిమి. ఎలన్ తలుపు తట్టెను. ఎబెనజరు తలుపుతీసి "నీ వెవరవు?" అని ప్రశ్నించెను.

"నేను స్కాట్లండు మిట్టనేలలకుఁ జెందినవాఁడను. నీ సోదరుని కుమారుడు డేవిడ్ బాల్ఫరు సముద్రమున నోడ మునుఁగుటవలన నపాయమునకు గురియైనాఁడు. నే నాతనిని రక్షించి యింతవరకుఁ బోషించితిని. అందులకు నాకుఁ బారి తోషిక మీయవలయును" అని ఎలన్ బదులుచెప్పెను.

"డేవిడ్ ఏమైనను నాకుఁ జింతలేదు. నే నొక చిల్లి గవ్వయైన నీయను."

"అయినచో నతనిని జంపివైతుము."

"మీ రేమిచేసినను నా కిష్టమే. అతని చావుబ్రతుకు లతో నాకు నిమిత్తము లేదు."

"మీరన్నమాట నిజమే! ఇటులనే మీరు ఓడకెప్టెను తోఁ జెప్పియుంటిరిగదా!"

ఆ మాటలు వినఁగనే ఎబెనజరు బాల్ఫరును నీ కడ్డురాకుండఁ జేసినంద డబ్బు యిచ్చినావు! నీ వసత్యము పల్కి... నా భాగస్వామియే. అతఁ డంతయు నాకుఁ జెప్పి... చెప్పుము. లేనిచో నేమిచేసెదనో తెలియునా?" అని ఎలన్ బెదరించెను.

ఎబెనజరుకు గత్యంతరము లేకుండెను. అందువలన నతఁ డిటులనెను. "ఇరువదిపౌనుల నిచ్చితిని. గుఱియు డేవిడ్‌ను బానిసగా నమ్ముకొని యీ సొమ్మును దీఁ కొనుట కనుమ తించితిని."

అంత రాన్‌కీలరు లోనికివచ్చి యిటులనెను. "నే నంతయు విన్నాను. ఎబెనజరు ఘాతుకచర్యలకుఁ గడంగినటుల స్పష్టమైనది. ఇందుకు నేనును, నా గుమాస్తాయు సాక్షులము. డేవిడ్ బాల్ఫరుకు న్యాయము జరుగవలయును."

ఎబెనజరు ముఖమున నొక రక్తపుచుక్కయైనను గాన్పింపదాయెను. "కాని చింతచచ్చినను బులుసు చావ" దన్నటుల నతఁడొక తుపాకినిఁ దీసికొనఁబోయెను. ఎలన్ ఆతని చేతినుండి తుపాకిని లాగుకొనెను. రాన్‌కీలరు ఆతని భుజమును బట్టుకొని వంటయింటిలోనికిఁ దీసికొనిపోయెను.

ఎబెనజరు మాకు లొంగిపోయెను. మేము విజయమును గాంచితిమి. విజయసూచకముగ మేమందఱమును జక్కని

ద్రాక్షసారాయమును సేవించితిమి. నా యదృష్టమునకు వారందఱు నెంతయు నభినందించిరి.

రాకీలరు, ఎబెనజరు వ్యవహారములను మాటాడుకొనిరి. ఒక గంటసేపైన తరువాత వారొక యంగీకారమునకు వచ్చిరి. దాని ప్రకారము సంవత్సరపు టాదాయములో మూడింట రెండుపాళ్ళు నా కొసఁగుటకు నెబెనజరు అంగీకరించెను. అట్టి యొడంబడికపై మే మిరువురమును సంతకములు చేసితిమి

అదృష్ట మనిన నిటులుండవలయును? కట్టుగుడ్డదక్క వేఱొండు గుడ్డలేని స్థితిలో నిల్లువీడి బయలుదేఱిన నేను నేఁడు పెద్ద యాస్తిపరుఁడనైతిని. ఇదియంతయు దైవమహిమ. భగవానుని చిద్విలాసము.

---

# తప్పక చదువతగినవి

| | | | |
|---|---|---|---|
| అబల | (నవల) | ... | 3-0-0 |
| సౌదామిని | (నవల) | ... | 2-8-0 |
| కథానికలు | | ... | 1-0-0 |
| డికెన్సు కథలు | మొదటి భాగం. | | 1-8-0 |
| ,, ,, | రెండవ భాగం. | | 1-8-0 |
| స్టీవెన్సు కథలు | | ... | 1-8-0 |
| ష్యూమా కథలు | | ... | 1-8-0 |
| స్కాటు కథలు | | ... | 1-8-0 |
| డాక్టర్ & అంకుల్ | | ... | 1-0-0 |
| నీతికథాంజలి 7 భాగముల సెట్టు | | | 3-8-0 |

## హిందీ పుస్తకములు

| | | |
|---|---|---|
| హిందుస్తానీ తెలుగు శిక్షక్ | ... | 0-4-0 |
| హిందుస్తానీ స్వయంశిక్షక్ ... | ... | 1-8-0 |
| హిందుస్తానీ వ్యాకరణ సంగ్రహ్ | ... | 1-0-0 |

# కేట్రియోనా

## 1

డేవిడ్ బాల్ఫరు ఎసెన్‌డీన్ గ్రామనివాసి; పదునేడేండ్ల యువకుఁడు. తల్లిదండ్రులంతకుమున్నే గతించిరి. ఆస్తి యనున దేదియులేదు. అందువలన నాతఁడు ఆ గ్రామమును విడచి తన భవిష్యత్తును జక్కఁదిద్దుకొన నెంచెను.

డేవిడ్ ఆ గ్రామమును వదలునప్పుడచ్చటి మతాధికారిని గలసికొనెను. ఆ మతాధికారి యాతనికొక యుత్తరము నిచ్చెను. అది డేవిడ్ బాల్ఫరు తండ్రి—ఎబెనజరు బాల్ఫరునకు వ్రాసిన యుత్తరము. పెద్దవారి పరిచయమునఁ దనస్థితి బాగుపడునని యెంచి డేవిడ్ ఆ యుత్తరము దీసికొని పయనము సాగించెను. ఎట్టకేలకుఁ గ్రామండు గ్రామమునకుఁ బోయి ఎబెనజరు గృహమునకు జేరుకొనెను. త్రోవలో నతని కనేక వింత యనుభవములు కలిగెను.

అతికష్టముపై డేవిడ్—ఎబెనజరు గృహమునఁ బ్రవేశము సంపాదించెను. కాని యచ్చటి తిండి మున్నగు పరిస్థితులఁజూచిన తరువాత భవిష్యత్తాతనికి నంధకారమయముగఁ దోఁచెను. ఎబెనజరు తన తండ్రి సోదరుఁడని డేవిడ్ తెలిసికొనెను. తన రాక ఎబెనజరున కంతగా నిష్టములేదని డేవిడ్ గ్రహించెను. అతనికొక సందియముగూడఁ దోఁచెను. ఎబెనజరు తన పినతండ్రియా? లేక తన తండ్రి, ఎబెనజరు కవలలా!

నిజమునకు—ఎబెనజరు డేవిడ్ పినతండ్రి. ప్రస్తుతము ఎబెనజ రనుభవించుచున్న యాస్తికంతటికిని డేవిడ్ తండ్రియే సర్వాధికారి. ఎబెనజ రాతనిని మోసముచే వెడలఁగొట్టెను. ఇపుడు డేవిడ్ ఆస్తికంతటికిని సర్వాధికారి. అందువలననే నెబెనజ రాతని నెట్లయినను దుదముట్టింపఁదలఁచెను.

ఒకనాఁటి రాత్రి చీఁకటి పూర్తిగా నలముకొని యుండెను. వర్షము కురియఁజొచ్చెను. అట్టితఱి ఎబెనజరు, డేవిడ్‌ను దుదముట్టింపఁదలఁచెను. మేడ మెట్లెక్కి, పైనఁగల యొక పెట్టెను దీసికొని రావలసినదని డేవిడ్‌ను బంపెను. డేవిడ్ ధైర్యసాహసములతో మెట్లెక్కెను. అంతలో నొక్క మెఱపు మెఱిసెను. డేవిడ్ మేడమెట్లనుండి క్రిందకుఁ బడుటకు సిద్ధముగా నుండెను. అవి యింకను బూర్తిగాఁ గట్టఁబడియుండ లేదు. డేవిడ్ ఎబెనజరు మోసమును గ్రహించెను. ఎబెనజరు తన తండ్రిసోదరుఁడు కాదు, తన శత్రువు అని భావించెను. దైవముపై భారమువైచి జాగ్రత్తగాఁ గ్రిందకు దిగి గృహములోఁ బ్రవేశించెను.

ఎబెనజరు—డేవిడ్ మరణించియుండునని భావించెను. అందువలన నాతఁడు డేవిడ్‌ను జూడఁగనే మూర్ఛిల్లెను. కొంత సేపైన తరువాత నాతఁడు తెలివిదెచ్చుకొనెను. అపుడాతఁడు డేవిడ్ చేతిలో ఖైదీయైయుండెను కాని యతఁడు సమయము కొఱకు వేచియుండెను.

"నన్నెందులకుఁ జంపుటకుఁ బ్రయత్నించితివి? అని డేవిడ్ ఎబెనజరును బ్రశ్నించెను. ఆ ప్రశ్న కెబెనజరు

సమాధాన మీయకపూర్వమే! 'కవెనెంటు' ఓడ కెప్టెనగు హోసీసనువద్దనుండు యొక కుఱ్ఱవాఁడు వారను దీసుకొని వచ్చెను. ఎబెనజరా యోడ కెప్టెనును గలసికొననెంచెను. అందుల కాతఁడొక యుపాయము పన్నెను.

"నీవు సముద్రము, ఓడలు మున్నగువాని నన్నిఁటినిఁ జూడవచ్చును. అదియుఁగాక మన న్యాయవాదియగు రాన్ కీలరు గృహము మనము పోవు ప్రదేశమునకు సమీపముననే యున్నది. అతనితో మనకుటుంబ వ్యవహారములను మాటాడుకొనవచ్చును." అని ఎబెనజరు డేవిడ్‌తోఁ జెప్పెను.

నలుగురి మధ్యకుఁ బోయినప్పుడెబెనజరు, తనకు హానిచేయుట కెట్టియవకాశము నుండదని డేవిడ్ అందుల ...కరించెను. సముద్రమును జూచి యానందించు బాల్య ...కుగూడ నాతనికి లేకపోలేదు. అందువలన నెబెనజరు, ...రను దెచ్చిన కుఱ్ఱవాఁడుకలసి యోడ కెప్టెను ...బోయిరి.

... కెప్టెను ఉన్నగది మిగుల వేఁడిగా నుండుటచేతను, ...మునుజూచి యానందింపవలెననెడు కుతూహల మెక్కు-... నుండుటచేతను డేవిడ్ ఆ గదిని వీడిపోయెను. ఇఁక ...నా గదిలో హోసీసను, ఎబెనజరు గలరు. వారనేక విషయములు రహస్యముగా సంభాషించుకొనిరి. డేవిడ్ దురదృష్టము వలన నట్టి వీలు వారికి కలిగెను.

డేవిడ్ సముద్రమును, బడవలను, అచటిమనుష్యులను, బాగుగాఁ బరిశీలించెను. పిమ్మట సత్రము యజమానినిఁ గలసి

కొనెను. ఆతనివలనఁ దన తండ్రియే పెద్దవాఁడనియు, ఎబె నజరు చిన్నవాఁడనియుఁ దెలిసికొనెను. తనకు న్యాయముగా రావలసిన యాస్తినిఁ గాఁజేయుట కెబెనజరు కుట్రపన్ను చున్నాఁడని గ్రహించెను.

తరువాత డేవిడ్ గదిలోనికి దిరిగివచ్చెను. ఓడకెప్టె నాతనిని బలుకరించి, యెంతయుఁ బ్రశంసించెను. ఆతని చెవిలో రహస్యముగా నిటులఁ జెప్పెను. "ఎబెనజరు కడుదుర్మార్గుఁడు. ఆతఁడు నీ కపకారము తలపెట్టినాఁడు. నీవు ఓడలోనికి వచ్చి నచో నంతయు విశదముగాఁ దెల్పెదను." డేవిడ్ తనపినతండ్రి దుష్టకార్యములను దెలిసికొననెంచెను. కెప్టెను, డేవిడ్, ఎబె నజరు, మఱికొందఱు ఓడలోనికిఁ బోయిరి. ఓడ ప్రయాణ మాయెను.

డేవిడ్ మోసగింపఁబడెను. ఆతనిని దూర దీసికొనిపోయి బానిసగా నమ్ముటకై ఎబెనజరు నది పౌనులనిచ్చెను. బానిసగా నమ్మఁగా వ గెప్టెనే తీసికొనవచ్చును. ఎబెనజరు తిరిగి యిం డేవిడ్ మోసమును గ్రహించి అఱవసాగెను. ఎవరో తలపై దుడ్డుకఱ్ఱతో మోదిరి. అతఁడు స్పృహత పోయెను. పిమ్మట నోడలో నొక భాగమున బంధింప

అచ్చట డేవిడ్ మరణింపవలసినదే. కాని యోడ వైద్యుఁడగు రియాంకనువాని సహాయమున నతఁడు బ్రతికెను. డేవిడ్ ఓడలో వేఱొకభాగమునకుఁ దీసికొనిపోఁబడెను. అంతలో నోడలో నొక దారుణమగు హత్యజరిగెను. ఓడలో

షూవను అను నొక యోడయుద్యోగి గలఁడు. ఆతఁడు త్రాగుఁబోతు. త్రాగియున్నసమయమున నొడలు తెలియక యతఁడు రేన్సుమను నోడలోఁ బనిచేయు కుఱ్ఱవానిని హత్య గావించెను.

డేవిడ్ రేన్సుస్థానమున నియమింపఁబడెను. ఓడలోని వారి కందఱకుఁ గావలసినప్పుడెల్ల నాహారపానీయముల నందిచ్చుటయే డేవిడ్ పని. ఆతని కా పని యేమాత్రము రుచింప లేదు అయినను, అదృష్టదినములకొఱ కెదురుచూచుచు నా పని చేయుచుండెను.

## 2

ఓడ ప్రయాణము చేయుచున్న సముద్రభాగము మిగుల నపాయకరమైనది. నీటి యడుగునఁ గొండలుగలవు. అవి యోడకుఁదగిలినచో నోడ ముక్కలు ముక్కలగును. అందువలన వారు ప్రాణములనఱచేతఁబెట్టుకొని యోడను నడిపించుచుండిరి. అటులుండగా హఠాత్తుగా నోడ కేదో తగిలెను. అదృష్టవశమున నది యొకపడవ. పడవ నీటమునిఁగెను. ఓడ కెట్టియపాయమును గలుగలేదు. పడవలోని వారిలో నొకఁడు తక్క మిగిలినవారందఱు నీటమునిఁగిరి. ఆ మిగిలినయొకఁడు ధైర్యసాహసములతో నెగిరి నోడలోనికి వచ్చిపడెను.

ఆ నూతన పురుషుఁడు మిగుల విలువగల దుస్తులు
చియుండెను. ఆతని కోటుకు వెండి గుండీలుండెను.
టకాలోఁ జాల గినీల ధనముండెను. ముప్పది గినీలను
యాతనినొక సురక్షితస్థానమునకుఁ జేర్చుటకుఁ గెప్టె

నంగీకరించెను. నూతన పురుషుఁడు ఆహారపదార్థములు, ఆయుధ సామగ్రికల గదిలో స్థావర మేర్పఱచు కొనెను.

కాని కెప్టెను కడు దుర్మార్గుఁడు. ఆ నూతన పురుషుని వద్దఁగల ధనమంతయు నపహరింపఁ దలచెను. అందుకొఱకాత నిని హత్య చేయుటకు సమకట్టెను. ఈ దుర్మార్గమునఁ బాల్గొనుటకు డేవిడ్ కూడ నాహ్వానింపఁ బడెను. డేవిడ్ భయపడి మొదట నంగీకరించెను. తరువాత నాతఁడు దీర్ఘముగా నాలోచించెను. తనకింతవఱకు హానిచేసిన వారికిఁ దనకింకను హానిచేయఁ బోవుచున్నవారికి సాహాయ్యము చేయుట కాతని మనస్సెంతమాత్ర మంగీకరింపలేదు. ఓడ యధికారుల దుర్మార్గము నాతఁడు వెంటనే యా నూతన పురుషునకుఁ దెలియఁ జేయ నెంచెను.

డేవిడ్ ఆ నూతన పురుషునిఁ గలసి కొనెను. కెప్టెను దుర్మార్గమును దెలియఁజేసెను. నూతనుఁడు కడు ధైర్యశాలి. రానున్న యపాయము నెదుర్కొనుటకు సిద్ధపడెను. ఇరువురును ఆయుధముల ధరించిరి. గది తలుపులు మూసివైచిరి. ఈ విషయమును ఓడ యుద్యోగులు తెలిసికొనిరి. వారు పదుముగ్గురును దండెత్తి వచ్చిరి. ఒక్క సంఖ్యా బలము వలని లాభము సున్న. ఇరువురును సింహనాదములు చేసుకొనుచు నతిభయంకరులై వీర విహారము సల్పిరి. శత్రువులు కొంద మరణించిరి. కొందఱు గాయపడిరి. మిగిలినవారు పలాయనచిత్తగించిరి. ఇరువురు వీరులును విజయము సాధించిరి.

కొంతతడవైన పిదపఁ గెప్టెను మున్నగువారు కాళ్ళ బేరమునకు వచ్చిరి. దయామయుఁడగు నూతనపురుషుఁ డందుల కంగీకరించెను. ఓడ సముద్రమున ప్రయాణము చేయు చుండెను. కాని సముద్ర మల్లకల్లోలముగా నుండెను. ఎట్టి యపాయము సంభవించునోయని యందఱును భయపడసాగిరి.

డేవిడ్ తన విచారగాథను నూతనపురుషునకుఁ దెల్పెను. నూతనుఁడు తన కథను దెల్పెను. ఒక వెండి కోటుగుండీని డేవిడ్‌కు ఇచ్చెను.

నూతనుని పేరు ఎలన్‌బ్రెక్. స్కాచియువకుఁడు. ప్రస్తుతపు రాజగు జార్జికి వ్యతిరేకి. రాజ్యత్యాగముచేసి ఫ్రాన్సులోఁ దలదాఁచుకొన్న స్టూవర్టురాజునకు నమ్మినబంటు. మిగుల ధైర్యసాహసములు కలవాఁడు. స్కాట్లండులోఁ గొందఱురైతులింకను స్టూవర్టురాజునకు శిస్తులు చెల్లించు చుండిరి. ఆ పైకమును వసూలుచేయుట ఎలన్‌పని. ఇది కోలిన్ కాంబెలు అను దుర్మార్గునకు గిట్టకుండెను. అతనికి 'ఎఱ్ఱనక్క' యను పేరుగలదు. అతఁడు జార్జిరాజు ప్రతినిధి. రైతుల ననేక విధములుగా బాధపెట్టుచుండెను. అతనిని జంపుట కనేకులు యత్నించుచుండిరి. అతఁ డనిన ఎలన్‌కు మిగులఁగోపము.

ఓడ ప్రయాణముచేయుచు హఠాత్తుగా నొక కొండకుఁ [illegible] ముక్క ముక్క లాయెను. ఓడలోని వారంద [illegible]ద్రములోనికి విసరివేయఁబడిరి. డేవిడ్ ఒక దుంగను [illegible]. అతని కీఁతరాదు. అతికష్టమున నీటిని వెనుకకుఁ

ద్రోయుచు ముందుకుఁ బోసాగెను. ఎట్టకేల కొక భూ భాగమును జేరుకొనెను.

అది యొక దీవి. నిర్జన ప్రదేశము. అందు డేవిడ్ మిగుల గష్టపడెను. తరువాత నాతఁడు మల్ దీవినిఁ జేరుకొనెను. అచట నాతఁడు ఎలన్ బ్రతికియున్న విషయమును దెలిసికొనెను. అటనుండి యాతఁడు టొరొసే చేరుకొనెను. పిమ్మట స్కాట్లండు మిట్ట భూములను జేరుకొనెను. అతఁడెట్లయిన ఎలన్‌ను గలసికొనఁ దలచెను.

త్రోవలో నాతఁడు కొలిన్ కాంబెలు మున్నగు రాజోద్యోగులను గలసికొనెను. అతఁడు కొలిన్ కాంబెలుతో మాటాడెను. అంతలో నెవరో తుపాకినిఁ బేల్చిరి. కొలిన్ కాంబెలునకు దెబ్బ తగిలెను. అతఁడు క్రిందఁబడి మరణించెను. రాజ సైనికులు హంతకుని కొఱకు వెదకఁ జొచ్చిరి.

డేవిడ్ హంతకుని యనుచరుఁడుగా ననుమానింపఁబడెను. అందువలన నాతఁడు పాఱిపోవలసి వచ్చెను. అప్పుడే యాతనికొక పొదలో నెలన్ కాన్పించెను. ఇరువురును గలసి పరుగెత్తసాగిరి. రాజభటులు వారినిఁ దరుమఁ జొచ్చిరి.

డేవిడ్—ఎలన్ హంతకుఁడని తలఁచెను. తరువాత నాతఁడు హంతకుఁడు కాఁడనియు, హంతకుని రక్షించుట దనపై ననుమానము పుట్టునట్లు పాఱిపోవుచున్నాఁడని దెలిసికొనెను.

తమ ప్రాణములను రక్షించుకొనుటకు వారిరువురు ననేక కష్టములుపడిరి. వాగులు దాటిరి. కొండలలోఁ దాఁగు

కొనిరి. వేళకుఁ దిండిలేదు; నిదురలేదు. ఎక్కడకుఁబోయి నను రాజభటులు వెంబడించుచునేయుండిరి.

ఒకనాఁడు వారు ఎలన్ స్నేహితుఁడగు జేమ్సు స్టీవర్టు ఇంటికిఁ బోయిరి. కొలిన్ కాంబెలు హత్యగావింపఁబడె నను విషయ మప్పటికే యాతనికిఁ దెలిసెను. అందువలన నాతఁడు మిగుల భయపడెను. జేమ్సు ప్రోత్సాహమున ఎలన్, కొలిన్ కాంబెలును జంపెనని ప్రభుత్వమువారు తలఁచి జేమ్సునుగూడ శిక్షింపవచ్చును. అందువలన వారిరువు రచ్చోటుఁవీడి యనేక కష్టములు పడి క్వీన్సుఫెరీ చేరిరి.

డేవిడ్, న్యాయవాది రాన్కీలరును గలసికొని తనకథను జెప్పెను. ఎబెనజరు మోసమును ఋజువుచేసినచోఁ దప్పక సాహాయ్యపడుదునని యాతఁడనెను. డేవిడ్, ఎలన్, రాన్ కీలరు, ఆతనిగుమాస్తా, ఎబెనజరు గృహమునకుఁ బోయిరి.

ఎలన్, ఎబెనజరుతో మాటాడసాగెను. మిగిలినవారు చాటుననుండిరి. ఎలన్ చాకచక్యమున ఎబెనజరు తప్పు నాతని నోటనే చెప్పించెను. ఈ విషయమంతయు విన్న రాకీలర్, ఎబెనజరును గలసికొని యింక లాభములేదనియు, డేవిడ్ ఆస్తిని ఆతని కిచ్చివేయవలసినదనియుఁ జెప్పెను. ఎబెనజరు మొదట వ్యతిరేకమును జూపెను. కాని కడకంగీకరింపక తప్ప లేదు. ఆస్తిలో మూఁడింట రెండుభాగములు డేవిడుకు నీయఁ బడెను. ఇరువురును నొక పత్రముపై సంతకములు పెట్టిరి. అటుల బీదవాఁడుగా బయలుదేఱిన డేవిడ్ భాగ్యవంతుఁ డాయెను.

# 3

డేవిడ్ విషయము కుదుటఁబడెను. కాని ఎలన్ విషయమింకను నట్లేయుండెను. ఆతఁడింకను గోలిన్ కాంబెలు హంతకుఁడుగా భావింపఁ బడుచుండెను. కనుకఁ దన్నురక్షించి యాస్తినిప్పించిన ఎలన్‌ను రక్షింప డేవిడ్ సమకట్టెను. మిత్రులన నిట్టివారే మిత్రులు. ఎలన్ ఫ్రాన్సునకుఁ బోవుట కెట్లయిన నొక యోడను గుదుర్పవలెను.

డేవిడ్ తనకు సాహాయ్యముచేసిన న్యాయవాది రాన్ కీలరును గలసికొని సలహా అడిగెను. రాన్ కీల రిట్లనెను. "ఓడ కుదురు వఱకు నేదేని యొక రహస్య ప్రదేశమున దాఁచి యుంచుము." ఎలన్ అట్లే యొక గుప్త స్థానమున దాఁగుకొనెను.

డేవిడ్, జేమ్సు స్టీవర్టునుగూడ రక్షింప సమకట్టెను. ఎలన్ ఎట్లయినను గొన్ని దినములలో ఫ్రాన్సునకుఁ బోవును. ఆతని కేభయమును నుండదు. కాని జేమ్సు దేశమును విడువఁ జాలడు.

జేమ్సు స్టీవర్టు ఏ పాపమెఱుఁగడని ఋజువు చేయుదు నని డేవిడ్ రాన్‌కీలరుతోఁ జెప్పెను. "అమాయకు లురిదీయఁబడుట ఏమాత్రమును న్యాయము కాఁజాలదు." అని డేవిడ్ ఉద్ఘాటించెను. "న్యాయము మాట దేవుఁడెఱుఁగును. జేమ్సుదినఱకే కారాగారమునకుఁ గొనిపోఁ బడినాడు. ఆతనిని బక్షపాతముగల న్యాయాధికారులు విచారింతురు. ఆతని కురిశిక్ష తప్పదు. నీవు సాక్ష్య మిత్తమన్నను, నట్లు చేయ

నీయరు. అయినను మనము, మనశ్శక్తి నుపయోగించి యాతని విడుదలకుఁ బ్రయత్నింతము" అని రాన్‌కీలరు చెప్పెను. రాన్‌కీలరు సలహాపైఁ బ్రభుత్వ న్యాయవాదినిఁ జూచుటకు డేవిడ్ సిద్ధపడెను.

"నీవు జాగ్రత్తగా నుండవలెను. కొంచెము హెచ్చు తగులు వచ్చిన నిన్నుఁగూడఁ గారాగారమున బంధింపఁగలరు." అని రాన్‌కీలరు హెచ్చరించెను.

"స్నేహితుల కొఱకుఁ బ్రాణము నిచ్చుటకంటె మిన్నయైన యదృష్టమేమి కలదు! నేనన్నింటికిని సిద్ధముగనే యున్నాను" అని డేవిడ్ సమాధాన మిచ్చెను. డేవిడ్ అచ్చోటు వీడిపోయెను.

తరువాత నాతఁడు ఎలన్‌కు ఒక ఓడను కుదుర్చుటకై ఎడింబరో నగరమున సొలిసిటరు పనిచేయుచున్న ఛార్లెసు అను వానినిఁ గలసికొనఁ దలచెను. ఛార్లెసు, ఎలన్ సంబంధీకుఁడే. అతఁడు జార్జిరాజపట్ల విశ్వాసము గలవాఁడు. అయినను బంధువగు ఎలన్‌కు సాహాయ్యము చేయుటకు వెను దీయఁడు.

డేవిడ్ ఎడింబరోలో నేదైన నొక యద్దెయింట నుండు టకు నిశ్చయించుకొని, యింటికొఱకు వెదకసాగెను. అతఁడట్లు పోవుచు, పోవుచు నొక పెద్ద యింటిముందాగెను. ఆ యింటి లోని కొక ఖైదీ, కొందఱు సిపాయిలు పోయిరి. తరువాత నచ్చట నొక కులీన స్త్రీ, ఆమె సేవకురాలు నిలఁబడియుండిరి. ఆ స్త్రీ చూచుటకు మిగుల నందముగానుండెను. యౌవ్వనమున

శోభిల్లుచుండెను. అందువలన డేవిడ్ ఆమెవైపునకుఁజూచెను. ఆమె డేవిడ్‌ను జూచెను.

ఆ యువతి తన సేవకురాలిని గెయిలిక్ భాషలోఁ దిట్టుచుండెను. ఎలన్ మాటాడు భాషగూడ నదియే. అందువలన డేవిడ్ ఆ మాటలను వినఁజొచ్చెను. ఆ యువతి, డేవిడ్‌ను గూఢచారునిగా భావించి మాటాడుట మానివైచెను. అంత డేవిడ్ ఆమెదగ్గఱకుఁబోయి క్షమాపణ కోరుకొనెను. అప్పుడా స్త్రీ తన యుదంతము నాతనికిఁ దెలియఁబఱచెను.

ఇంటిలోనికిఁ దీసికొనిపోఁబడిన ఖైదీ ఆ స్త్రీ తండ్రి. పేరు జేమ్సుమోర్. ఆ యిల్లు ప్రభుత్వ న్యాయవాది గ్రాంటు నివసించుతావు. జేమ్సును బ్రతిదినము నచటకుఁ దీసికొనివచ్చి కొంచెము సేపు అచ్చట నుంతురు. అతఁడు తిరిగి తీసికొని పోఁబడినప్పుడా స్త్రీ యాతనికి ముక్కుపొడుము నిచ్చును. ఆ నాఁడు పొడుము తీసికొనిరావలసినదిగా సేవకురాలికిఁ గొంత డబ్బియ్యఁగా నామె దానినిఁ బాఱవైచెను. పొడుములేనిచో జేమ్సు మోర్ బాధపడును.

అపుడు డేవిడ్ సేవకురాలికిఁ గొంత పైకము నిచ్చి పొడుము తెప్పించెను. ప్రభుత్వ న్యాయవాది గృహము నాతఁడు తెలిసికొనఁగలిగెను. "మీకు బంధువగు రాబిన్‌ను నే నెఱుఁగుదును. అందువలన మీరు నాకుఁ గ్రొత్తకాదు." అని డేవిడ్ ఆ స్త్రీతో సంబంధము కలుపుకొనెను.

ఆ స్త్రీయే కేత్రియోనా. ఎడింబరో నగరమునకు సమీపమున నున్న డన్ గ్రామమున నివసించుచున్నది. ఆమె డేవిడ్ హృదయమున స్థానమేర్పఱచుకొనెను. ముందేమికానున్నదో!

## 4

డేవిడ్ బాల్ఫరు, ఎలన్ కొకయోడను గుదుర్చుటకై సొలిసిటరు ఛార్లెసును గలసికొనఁబోయెను. మఱియు నాతఁడు తనకు నింటినిఁ గుదుర్చుటలో సాహాయ్యపడవచ్చునని డేవిడ్ తలంచెను.

డేవిడ్ పోవుసరికి ఛార్లెసు తన గుమాస్తాతోఁ గొన్ని విషయములు మాటాడుచుండెను. డేవిడ్‌ను జూఁడగనే యాతఁడా గుమాస్తాను బయటకుఁ బంపివైచెను.

"నీ వెవ్వరవు? నీవు వచ్చిన పనియేమి?" అని ఛార్లెసు ప్రశ్నించెను. ఆతఁడా ప్రశ్న యడిగినదే తడవుగ డేవిడ్ తన కథయంతయు సవిస్తరముగఁ జెప్పెను. ఛార్లెసా కథయంతయు సావధానముగా నాలకించి తన బందుగగు ఎలన్ కష్టస్థితిలో నున్నందుకు విచారించెను. ఎట్లయినను నాతఁడు ఫ్రాన్సుకుఁ బోవుటకుఁ దగిన సదుపాయములఁ గావింతునని వాగ్దానము చేసెను. ఎలన్, జేమ్సు స్టీవర్టులు నిర్దోషులని దెలిసికొనినపు డాతఁడు పొందిన యానందమునకు మితిలేదు.

తరువాత, ఎలన్, జేమ్సు స్టీవర్టులు నిర్దోషులని ఋజువు చేయుటకుఁ దాను ప్రభుత్వ న్యాయవాదినిఁ గలసికొనఁ బోవుచున్నట్లు డేవిడ్, ఛార్లెసుకుఁ దెలిపెను. ఇదివఱకు రాన్‌కీలరు

చెప్పినట్లుగనే సాక్ష్యము నిచ్చుటకు వీలుండదని ఛార్లెసుగూడఁ జెప్పెను. సాక్ష్యము చెప్పనిచ్చినను, చెప్పనీయకపోయినను, దనకుఁ దెలిసినవిషయమును బహిర్గతము చేయక మాననని డేవిడ్ వాక్రుచ్చెను. తెలివితక్కువగాఁ బ్రవర్తించినచో నతనిపైఁగూడ హత్యానేరము మోపఁబడుననియు, ఖైదులోఁ బెట్టఁబడుననియు ఛార్లెసు, డేవిడ్‌ను హెచ్చరించెను. డేవిడ్ అంతమాత్రమునఁ జలించువాఁడు కాదు. ప్రపంచము తల్లక్రిందులైనను, దన కెట్టిహాని కలిగినను జెప్పక దప్పనని డేవిడ్ తన మనోనిశ్చయమును దెలిపెను. ఛార్లెసాతని సద్గుణముల నెంతయు నభినందించెను. మఱియొకసారి రాఁబోవు నపాయమునుగూర్చి హెచ్చరించెను.

ఆ నాఁటికి డేవిడ్ సమావేశము చాలించెను.

మఱునాఁటి సాయంకాలము డేవిడ్ ప్రభుత్వ న్యాయవాదినిఁ గలసికొనఁ బోయెను. అక్కడఁ జాలసేపు వేచి యుండవలసి వచ్చెను. ఎట్టకేలకు డేవిడ్ లోపలకుఁ బ్రవేశపెట్టఁబడెను. ప్రభుత్వ న్యాయవాది డేవిడ్‌ను బలుకరించెను.

ప్రభుత్వ న్యాయవాది నెఱిఁగిన యొక పెద్ద మనిషి వ్రాసియిచ్చిన యుత్తరమును డేవిడ్ అతని కొసఁగెను. ప్రభుత్వ న్యాయవాది యా యుత్తరమును జదువుకొని డేవిడ్ నకుఁ గావలసిన సాహాయ్యమును దెలిపినచోఁ దనకుఁ జేతనైనంతవఱకుఁ బ్రయత్నించి చూతు ననెను.

డేవిడ్ తన కథ నిట్లు చెప్పెను. "కొలిన్ కాంబెలు చంపబడి నప్పుడచటనున్న పిల్లవాఁడను నేనే. అతనిని జంపిన వాఁడు పాఱిపోవుచుండఁగా నేను జూచితిని. ఈ హత్యలో ఎలన్‌కు గాని, జేమ్సు స్టీవర్టుకుఁ గాని యెట్టి సంబంధమును లేదు. వారు నిర్దోషులు. జేమ్సు స్టీవర్టు అన్యాయముగాఁ గారాగారమున బంధింపఁ బడినాడు. నాకుఁ దెలిసిన విషయ మంతయు బహిర్గతము గావింతును."

డేవిడ్ ఎంతో వినయముగా మాటాడెను. కాని యందాతని స్థిర నిశ్చయముగూడ వెల్లడియగు చుండెను. అందువలనఁ బ్రభుత్వ న్యాయవాదికి మిగులఁ గోపము వచ్చెను.

ప్రభుత్వ న్యాయవాది ఎదుటివారికి భయమునుగొల్పు చూపులతో, గంభీర స్వరమున నిట్లనెను. "నీ సాక్ష్య మెవరి కిని అక్కఱలేదు. నీ విచ్చుటకు వీలుండదు."

డేవిడ్ కొంచెదిగాభయపడెను కాని వెంటనే ధైర్యము తెచ్చుకొని తాను న్యాయస్థానమునఁ దప్పక సాక్ష్యమిత్తునని యుద్ఘాటించెను. ప్రభుత్వ న్యాయవాది కెంతో కోపము వచ్చెను. కాని యొక్కక్షణములోఁ నాతఁడు కడుశాంతచిత్తుఁ డాయెను.

శాంతముట్టిపడ నాతఁ డిట్లనియెను "డేవిడ్ నీ ధైర్య మున కెంతయు నభినందించుచున్నాను. నీవు చాల మంచి వాఁడవుగా దోఁచుచున్నావు, నీవు సాక్ష్యమిచ్చుటకుఁ దగిన యేర్పాట్లను దప్పక గావింతును. ఈ రోజుననే చేయుటకు వీలులేదు. నేఁడు శనివారము. నన్నుఁ దిరిగి సోమవారము

కలసికొనుము. తప్పక కలసికొనవలెను. ఈ మాట నే సంద ర్భమునను మఱవవద్దు. నీవు వచ్చినప్పుడు, కావలసిన యేర్పా ట్లను గావించుకొనవచ్చును. కాని ఈ విషయము నెవరకును దెలియనీయరాదు. ఒక్కమాటయైనను బైటకి బొక్కరాదు. అట్లని వాగ్దానము చేయుము.”

డేవిడ్ ప్రభుత్వ న్యాయవాది కోరినవాగ్దానముచేసెను. ఆ విషయము లన్నిటిని రహస్యముగా నుంచుటకుఁ బ్రభుత్వ న్యాయవాదిగూడ నంగీకరించెను. అంతేకాదు. ఆ యింట నున్నంతవఱకు డేవిడ్‌కు ఎట్టి హానియుఁ గలుగదని ప్రభుత్వ న్యాయవాది హామీ నిచ్చెను.

సోమవారము ఉదయ కాలమున డేవిడ్ తిరిగి ప్రభుత్వ న్యాయవాది యింటికిఁ బోయెను. ఆతఁడటకుఁ బోవుసరికి జేమ్సు మోర్ సైనికులచేఁ జుట్టఁబడి యుండెను ఆతఁడు కే(ట్రియోనా తండ్రియను నభిమానమున డేవిడ్ పలుక రించెను. తన పేరును దెలుపుకొనెను. అంత జేమ్సుమోర్ ఇట్లనెను.

“నిన్ను నేనిదివఱకుఁ జూడలేదుగాని నీ కుటుంబము వారు నాకుఁ గ్రొత్తవారు కారు. వారిలోఁ జాలమంది నాకుఁ బ్రాణ స్నేహితులు. వారు నాకవసరము వచ్చినప్పుడెల్ల సర్వవిధముల సాహాయ్య పడెడివారు. ఇప్పటికిని వారు నాకు సాయపడుదురు. నేను గోరినచో నీవుమాత్రము నాకుఁ గావల సిన డబ్బు నీయవా? అవసరము వచ్చినపుడు నీవు నాకుఁ దగిన సాహాయ్యము చేయక తప్పదు.”

జేమ్సు మోర్ హీనుఁడు. నీచుఁడు. అతని వద్దఁ బెద్దమనిషి తరహా మచ్చునకైనఁ గానరాదు. తిరుస్కారము బుద్ధి యాతనిది. కేట్రియోనా తండ్రి యనుపించుకొనుట కాతనివద్ద నెట్టి యర్హతయు లేదనుటలో నతిశయోక్తి యే మాత్రమును లేదు. డేవిడ్ ఆతని వాగ్ధోరణిఁ జూచి మిగుల నసహ్యించుకొనెను.

తరువాత డేవిడ్ లోనికిఁ బోయి ప్రభుత్వ న్యాయ వాదినిఁ గలసికొనెను. ప్రభుత్వ న్యాయవాది యాతనిని మిగుల నాప్యాయముగ నాహ్వానించి, గౌరవించి, కూర్చుండఁ జేసెను.

ప్రభుత్వ న్యాయవాదికి ముగ్గురు కొమార్తెలుగలరు. వారు మిగుల అందమైనవారని చెప్పవచ్చును. వారు డేవిడ్‌కుఁ బరిచయము చేయఁబడిరి. పెద్దకొమార్తె ముగ్గు రిలో నందమున మిన్న. ఆమె డేవిడ్‌ను మిగుల దయతోఁ జూచి విరివిగా మాటాడసాగెను. ఆమె మాటలనుబట్టి తన కథయంతయుఁ ప్రభుత్వన్యాయవాది యామెకుఁ దెలిపెనని డేవిడ్ గ్రహించెను. "నీవు యువకుఁడవు. ముందు ముందు మంచి యభివృద్ధిలోనికి రావలసినవాఁడవు. నీవు రాజమార్గ మున నడువవలయును; గాని గతుకులదారినిఁ బడరాదు." అని యామె డేవిడ్‌కు హితబోధచేసెను. డేవిడ్ ఆ హితబోధను బెడచెవినిఁ బెట్టెను.

ప్రభుత్వ న్యాయవాది డేవిడ్‌ను తన గదిలోనికిఁ దీసి కొనిపోయెను. డేవిడ్ ఆ గదియంతయు వివరముగాఁ బరిశీలిం

చెను. అందొకచో, మఱియొక న్యాయవాది కూర్చుండి యుండెను. అతఁడే సైమను ప్రేజరు. ప్రభుత్వ న్యాయవాది వారిరువురకును బరిచయము జేసెను. సైమను పేరు వినఁగనే, డేవిడ్ కు ఆతఁడనిన మిగుల నసహ్యాము కలిగెను. ఏలయన మున్నాతఁడు జార్జిరాజుపైఁ దిరుగుబాటులోఁ బాల్గొనెను. అందుల కాతని తండ్రి యురిదీయఁబడెను. అంత నాతఁడు బిఱికిపందవలెఁ బ్రభుత్వమువారికి లొంగి, వారితో సఖ్యము చేసికొనెను. ఇప్పుడాతఁడు ప్రభుత్వ న్యాయవాదికి సహాయుఁడుగాఁ బనిచేయుచుండెను.

ప్రభుత్వ న్యాయవాది యేదోయొక మిషపై యాగదిని వీడిపోయెను. ఇఁక నా గదిలో డేవిడ్, సైమనుమాత్రమే యుండిరి.

"నీ వింకను జేమ్సు స్టీవర్టు నిర్దోషియని సాక్ష్యమీయఁ దలఁచుచున్నావా ?" అని సైమను ప్రశ్నించెను. దానితో సైమను కెట్టి సంబంధమును లేదని డేవిడ్ జవాబిచ్చెను.

అంత సైమను ఇట్లనెను. "నాకు సంబంధము కలదు; కనుకనే మాటాడుచున్నాను. హత్యగావింపఁబడిన కొలిన్ కాంబెల్ సామాన్యుఁడుకాదు. ఆర్గయిలు ప్రభువున కాతఁడు చుట్టము. జేమ్సు స్టీవర్టు శిక్షింపఁబడుట యాతని యభిమతము. కావున నీవు జేమ్సు స్టీవర్టు నిర్దోషియని సాక్ష్యమీయరాదు. అప్పుడు ఆర్గయిలుప్రభు వెంతయు సంతసించి నీకు సర్వదా బాసటయై నిలఁబడును. ప్రభువు వారిమాటను మన్నింపనిచో

నేమగునని నీవు ప్రశ్నింపవచ్చును. నేను ముందే చెప్పుచున్నాను. జాగ్రత్తగా నాలకింపుము.

కొలిన్ కాంబెల్ హత్యగావింపఁబడినపుడు నీ వచ్చటనే యుంటివిగదా! కనుక ఎలన్, జేమ్సు స్టీవర్టులతోఁబాటు నీవుగూడ హత్యకుఁ గడఁగితివని మేము సులభముగా ఋజువు చేయఁగలము. అందులకు దగిన సాక్ష్యమును సులభముగా సంపాదింపఁగలము. మేము చెప్పినట్లెల్లఁ జెప్పు ఖైదీ లనేకులు మా వశమునఁ గలరు. అప్పుడు నీ గతి యేమగునో గ్రహించితివా ! ఉరిశిక్షయే నీకుబహుమానము. కావున నీవు బాగుగా నాలోచించి యొక నిర్ణయమునకు రావలెను."

డబ్బున కాశపడి కూటసాక్ష్య మిచ్చువారు పలువురు గలరను విషయము డేవిడ్‌కుఁ దెలియును. అయినను డేవిడ్ ఏమాత్రమును జలింపలేదు. ఎవరి కిచ్చవచ్చినపనిని వారు చేయవచ్చునని డేవిడ్ నుడివెను.

అంత సైమ నొక కాగితమును బైటకుఁ దీసెను. అది డేవిడ్‌ను బంధించుటకుఁ బ్రభుత్వము వారిచ్చిన యుత్తరువు. ఆ యుత్తరువును జూపుచు "నీవు సర్వనాశనమై పోదువు. జేమ్సు స్టీవర్టుకుఁ బట్టినగతియే నీకును బట్టును. నీ ప్రాణమంతయు నా చేతనున్నది." అని సైమను డేవిడ్‌ను భయపెట్టెను.

సైమను బెదరింపు కొంతవఱకుఁ బనిచేసెను. డేవిడ్ ఒక్కింత చలించెను. కాని వెంటనే కోల్పోయిన ధైర్యమును దెచ్చుకొనెను. గంభీర స్వరమున నిట్లనెను. "నా కేమాత్రము

భయములేదు. నాకుఁ బ్రభుత్వ న్యాయవాది రక్షణ గలదు. నేనీయింటనున్నంత వఱకు నాకెట్టి భయమును లేదని యాయన నాకిదివఱకు వాగ్దానము చేసియున్నాఁడు గౌరవనీయుఁడగు నాతఁడు తనమాటకు వ్యతిరేకము జరుగుచుండఁగా జూచుచు నూరకుండునా? అట్టిచో నాతఁ డసత్యవాది యనిపించు కొనఁడా"?

అదే సమయమునఁ బ్రభుత్వ న్యాయవాది గదిలోనికి వచ్చెను. సైమనుతో నాతఁ డిట్లనెను. "నీ కోటమి తప్పదని నాకుఁ దెలియును. డేవిడ్‌ను సామాన్య యువకునిగా భావించితివి. నీవాతని నేమాత్రము భయపెట్టఁజాలవు."

తరువాత నాతఁడు డేవిడ్‌తో నిట్లనియెను. "నీవేమియు ననుకొనకుము. నీ ధైర్యమును బరీక్షించుటకై మే మీ కపట నాటక మాడితిమి. నీవే విజయమును గాంచినావు. నీవు నీ యిచ్చవచ్చిన చోట్లనఁ బోవచ్చును. నీవు మాకే కాదు ఇష్టుఁడవు; నీ వనిన మా కొమార్తెలకుఁగూడ నిష్టముగా నున్నది. ఆ పాకపరి వీలుచేసుకొని యిటకు రమ్ము. నా కొమార్తెలతో వాహ్యాళికిఁ బోవచ్చును. తప్పక రావలెను."

పరిస్థితులు ముందెట్లు మాఱునోయని తలంచుచు"సరే" యంటిని. పిమ్మట నా గృహమును వీడిపోతిని.

## 5

డేవిడ్‌కు ఏమియు నష్టము కాకుండెను. ప్రభుత్వ న్యాయవాది మొదటిసారి, జేమ్సు స్టీవర్టు నిర్దోషియని సాక్ష్య మీయవలదని హెచ్చరించెను. రెండవసారి యాతఁడు దానినిఁ

గూర్చి హెచ్చరింపలేదు. అందాలరాశియగు ప్రభుత్వన్యాయ వాది పెద్దకూతు రపుడు హెచ్చరిక గావించెను. తరువాత సైమను, మొదట పెద్దవారి యనుగ్రహము నాశించెను. పిమ్మట బెదరించెను. కడకుఁ బ్రభుత్వన్యాయవాది యది యంతయు హాస్యమునకు జరిగినపనియని నమ్మింపఁజూచెను. డేవిడ్ బాగుగ నాలోచించెను. "ఇందు హాస్యమేమియు లేదు. ఎట్లయినను నేను సాక్ష్యమీయకుండఁ జేయవలెనని యాతఁడు తలఁచుచున్నాఁడు." అని డేవిడ్ అభిప్రాయపడెను.

డేవిడ్ మనస్సు పరిపరివిధములఁ బోసాగెను. భయము, విచారము, సంతోషము మున్నగున వన్నియు గుమిగూడి యుండెను. అతఁడు ఎడింబరో నగర సమీపమునఁ గల డీన్ గ్రామమునకుఁ బోయెను. క్రేటియోనా నివసించుచున్న గ్రామ మదే. డేవిడ్ తిన్నఁగాఁ గ్రేటియోనా గృహము నకుఁ బోయెను. క్రేటియోనా యింట లేదు. ఎటకో పోయి యుండెను.

క్రేటియోనాను కలసికొనలేకపోయినందుకు డేవిడ్ మిగుల దుఃఖపడి తిరిగి పోవుచుండెను. అంతలో వెదకఁ బోయిన తీగె కాలికిఁ జుట్టుకొనినట్లు క్రేటియోనా యాతని కెదురుపడెను, ఒకరి కొకరు కుశలప్రశ్నలు గావించుకొనిరి. డేవిడ్ క్రేటియోనా ననుసరించెను. వారి సంభాషణ మిగుల సొంపుగా నుండెను.

ఒక సందర్భమునఁ గ్రేటియోనా యిట్లనెను. "ఆనాఁడు నా తండ్రికి ముక్కుపొడుము కొనుటకై నీవు డబ్బిచ్చితివి

ఆ డబ్బు తిరిగి తీసికొనుటకు వచ్చుచున్నావా ?" డేవిడ్ ఇవ్వలేదు. నవ్వవలెనో, ఏడ్వవలెనో యాతని కర్థము కాలేదు. జేమ్సుమోర్ను గలసికొంటినని యాతఁడనెను. అంతఁ గ్రేటి యోనా ప్రశ్నల వర్షము కురిపించెను. "అతఁ డేమని నాఁడు ? అతఁ డనిన నీ కిష్టమేనా ?............"

జేమ్సు మోర్ను డేవిడ్ అపరిమితముగా ద్వేషించుచుండెను. అతని ప్రవర్తన యాతని కన్నులకుఁ గట్టినట్లుగా నుండెను. అందువలన డేవిడ్ ఏమియు మాటాడలేదు. క్రేటి యోనా మిగులఁ దెలివైన యువతి. ఆమె యావలించినఁ బ్రేగులు లెక్కింపఁగలదు. అందువలన నామె సులభముగా డేవిడ్ మనస్సును దెలిసికొనెను.

"నా తండ్రి యనిన నీ కిష్టములేదని నీ మౌనము చెప్పకయే చెప్పుచున్నది. నీ కట్టి యభిప్రాయము కలుగుట చాల విచారకరము. నా తండ్రిని మెచ్చనివారు నా కిష్టులు కారు. కావున నీవు నా కయిష్టుఁడవైతివి" అని పలికెను. అది డేవిడ్కు అశనిపాతమువలె నుండెను.

"ఈ విశాల ప్రపంచమున నే నేకాకిని. నా పక్షమునఁ బలుకువా రొక్కరును లేరు. అందఱును నాకు విరోధులే. నీవుగూడ నాకు వ్యతిరేక మగుచోఁ నింకఁ జెప్పవలసిన దేమున్నది ?" అని డేవిడ్ వాపోయెను.

క్రేటియోనా డేవిడ్ మొగమును నిశితముగఁ బరిశీలించెను. అందు ఆమెకుఁ గష్టముల పరంపర కాన్పించెను.

డేవిడ్ తన కథయంతయు జెప్పెను. కేౖటియోనా మిగుల జాలినొందెను.

"ఈ క్షణమునుండి నేను నీ స్నేహితురాలను; నీవు వీరాధివీరుఁడవు" అని కేౖటియోనా పలికెను. డేవిడ్ హృదయము తేటపడెను. సంతస మావరించెను. కేౖటియోనా ఆ మార్పును గమనించెను. "నీ యిచ్చవచ్చినపుడెల్ల నా వద్దకు రావచ్చును. నీ కెట్టి యభ్యంతరము నుండదు." అని కేౖటియోనా తెలిపెను. ఇరువురును గరచాలన మొనర్చుకొనిరి. డేవిడ్ ఆ ప్రదేశమును వీడిపోయెను.

మఱునాఁటి యుదయముననే డేవిడ్ ప్రభుత్వ న్యాయవాదియింటికిఁ బోయెను. ఆ నాడు రావలసినదని ప్రభుత్వ న్యాయవాది యాతని నిదివరకే యాహ్వానించియుండెను.

ప్రభుత్వ న్యాయవాది డేవిడ్‌ను సాదరముగ నాహ్వానించెను. తరువాత నాతఁ డిట్లనెను. "డేవిడ్! నీకు మేలు చేయు నవకాశము నాకు లభించినందుల కెంతయు సంతసించుచున్నాను. నీ కోరికను నే దీర్తును. నీ సాక్ష్యమును దీసికొందును. న్యాయస్థానమునకు నిన్ను నేనే తీసికొనిపోదును. విచారణదినమున నంతయు సక్రమముగా జరుగును." ఆ మాటలను విన్నపుడు డేవిడ్ ఆనందమునకు మితి లేకుండెను.

ఎలన్‌బ్రెక్ యెక్కడనున్నాడో తెలుపవలసినదని ప్రభుత్వన్యాయవాది డేవిడ్‌ను గోరెను. తన కా సంగతి తెలియదని డేవిడ్ జవా బిచ్చెను. ప్రభుత్వన్యాయవాది గ్రుచ్చి గ్రుచ్చి యడుగఁ జొచ్చెను. డేవిడ్ మౌనము

దాల్చెను. అంతఁ బ్రభుత్వన్యాయవాది యా ప్రసక్తిని మాని వైచెను.

పిమ్మట వారిరువురును గలసి వేరొక గదిలోనికిఁ బోయిరి. అచటఁ బ్రభుత్వన్యాయవాది కొమార్తె లుండిరి. డేవిడ్‌ను అచ్చట విడచి ప్రభుత్వన్యాయవాది తన పనిపైఁ బోయెను.

అంత వారందఱును గలసి హోప్ పార్కునకు వాహ్యాళికి బయలుదేఱిరి. హోప్‌పార్కువద్ద మఱికొంతమంది యువతులు వారినిఁగలసికొనిరి. అదియంతయు ముందే యొక నిర్ణయము చేసికొని జరిగించినట్లుంచెను. డేవిడ్‌కు అది యంతయు నయోమయముగాఁ గన్పట్టెను. ఆ యువతులందఱును గందరగోళముగా మాటాడుచు, నవ్వఁజొచ్చిరి. డేవిడ్ ఆ పార్కులో నొక మూల విడిగాఁ గూర్చుండియుండెను. అంతలో నతనివద్ద కొక మనుజుఁడు వచ్చెను.

"డేవిడ్ బాల్ఫరు నీవేనా?" అని యాతఁడు ప్రశ్నించెను.

"అవును, నేనే. నాతో నీకేమిపని?" అని డేవిడ్ అడిగెను.

అంత నా క్రొత్తవాఁడు డేవిడ్ మూతిపై నొకదెబ్బ వేసెను. డేవిడ్ దానికి బదులు తీర్చెను. నూతనుఁడు కత్తి తీసెను. డేవిడ్ పోరాటమునకుఁ దలపడలేదు. నూతనుఁడా బలహీనతను గుర్తించి డేవిడ్‌వద్దఁగల కత్తి నావలకు విసరి

వైచెను. డేవిడ్ దానినిఁ దెచ్చుకొనెను. అంత నా నూతనుఁడు తన కత్తిని దాఁచుకొనెను.

“నీకుఁ గత్తిపోరాటము వచ్చునని భావించితిని. తెలియక కత్తిదూసినందుకు క్షమింపు”మని నూతనుఁ డనెను.

“నాకుఁ గత్తిపోరాటము రానిమాట నిజమే. కాని నేను బిఱికివాఁడనుగాను. ధైర్యముగా నీ యెదుట నిలఁబడిన విషయమును గ్రహించితివిగదా”యని డేవిడ్ బదులుపలికెను.

“నిజముగా నీవు వీరుఁడవు. ధైర్యసాహసములతో నెదుర్కొడ్డి నిలచినందుకు నా యభినందనలను గైకొనుము. ఈ ప్రపంచమున నెవరియుండైనను సరే నీవు వీరుఁడవని ఘంటాపథముగఁ జెప్పఁగలను.” అని నూతనుఁ డనెను.

నూతనుఁడు, డేవిడ్ కలసి ప్రభుత్వ న్యాయవాది యింటికిఁ బోయిరి. అపు డచటఁ బ్రభుత్వన్యాయవాది, సైమను ఫేజరు మరియొకడు యేదో ముఖ్యవిషయమునుగూర్చి మాటాడుకొనుచుండిరి.

ప్రభుత్వన్యాయవాది డేవిడ్‌ను యిటులఁ బ్రశ్నించెను. “ఇపు డెందులకు వచ్చితివి ! నిన్నెవరు రమ్మనిరి ?”

డేవిడ్ నూతనునిఁ జూపి, “ఇతఁడు మీకు గొన్ని విషయములను దెలుపును. అందుల కీతని నిటకుఁ దీసికొని వచ్చినాను.”

అంత నా నూతనుఁ డిటులనియెను. “డేవిడ్ బాల్ఫరు మిగుల ధైర్యసాహసములు గలవాఁడు. ఎట్టి కష్టమునైన

నెదుర్కొనఁగలడు. పురుషుఁడన నీతఁడే నిజమైన పురుషుఁడు. ఈతఁడు వీరాధివీరుఁడు."

ఆ నూతనుఁడటనుండి నిష్క్రమించెను. అటుపిమ్మట డేవిడ్ ప్రభుత్వ న్యాయవాదితో నిట్లనెను "ఇకముందు మీరు నావెనుక నితరులను బంపవలసిన యవసరము లేదని గ్రహించితిరని తలఁచుచున్నాను. నన్నితరులచే హత్య చేయింపవలసిన యవసర మిసుమంతయు లేదని గ్రహింపుఁడు."

ప్రభుత్వ న్యాయవాదికి సైమనుపై నెంతయో కోపము వచ్చెను. ఆతఁడు మండిపడి యిట్లనెను. "సైమన్, నేను ఒక విధమున నడచుచుండ, నీవింకొక విధము ననుసరించితి వేల? నీకీ స్వాతంత్ర్య మెవరిచ్చినారు?"

ప్రభుత్వ న్యాయవాది తనకేదో యపకారమును జేయఁ దలపెట్టినాఁడని గ్రహించి, డేవిడ్ వెంటనే యా ప్రదేశమును వీడిపోయెను.

# 6

డేవిడ్ బాల్ఫరు పరిస్థితి మిగుల దుర్భరముగానుండెను. ఆతనికిఁ బ్రతిచోటను నపాయకమగు శత్రువులే ప్రత్యక్షమగు చుండిరి. ప్రభుత్వన్యాయవాది, సైమను ఫ్రేజరు, ఆర్గయిలు ప్రభువు, జేమ్సు మోర్ మున్నగువారందఱును నాతనికి శత్రువులే. స్నేహితుఁడనువాఁడు కాన్పింపకుండెను. ఆ పరిమిత్రుని కొఱ కాతని మనస్సెంతయుఁ దపించుచుండెను. డేవిడ్ భగవంతు నెంతయుఁ బ్రార్థించుచుండెను.

డేవిడ్ గృహోన్ముఖుఁడై పోవుచుండఁగాఁ ద్రోవలో ఛార్లెసు స్టీవర్టు కనఁబడెను. ఆతనిని జూడఁగనే డేవిడ్ మనస్సెంత సంతసించెనో వ్రాయనలవిగాదు. ఆతఁడు వెంటనే ఛార్లెసును బలుకరించి తన దుస్థితియంతయు వివరముగఁ దెలియఁజేసెను. ఆపద్బాంధవునివలె ఛార్లెసంతయు సావధానముగా విని పిమ్మటఁ జక్కని సలహా నిచ్చెను.

"డేవిడ్, నీవు మిగుల నిస్సహాయస్థితిలో నున్నావనుటలో సందియ మేమాత్రమును లేదు. నీ శత్రువులు నిన్నెత్తుకొనిపోయి, జేమ్సు స్టీవర్టు విచారణ పూర్తియగునంతవఱకు నెక్కడనో దాచియుంతురని స్పష్టమగుచున్నది. పిమ్మట నిన్ను వదలివేయుదురు. కావున నీ వెక్కడికైనను బారిపోవలయును. ఎక్కడికని ప్రశ్నింపకుము. నీ యిచ్ఛవచ్చినచోటికిఁ బారిపొమ్ము. ఇంతకుమించి నే నేమియుఁ జెప్పఁజాలను."

డేవిడ్ అందుల కంగీకరించెను. తరువాత నాతఁడు ఎలన్ ఫ్రాన్సునకుఁ బోవు విషయమునుగూర్చి ప్రశ్నించెను. ఎలన్ ప్రాన్సునకుఁ బోవుటకుఁ గావలసిన యేర్పాట్లన్నియుఁ బూర్తిగావింపఁ బడుచున్నవని ఛార్లెసు స్టీవర్టు తెలిపెను. ఎలన్ ఫ్రాన్సునకుఁ బోవుటకు ముందొకసారి డేవిడ్ ఆతనిని జూడఁదలఁచెను. ఎలన్ గూడ డేవిడ్‌ను జూడ వాంఛించుచున్నాఁడనియు, నాఁటిరాత్రి సిల్వారు మిల్సు వద్దఁ గలసికొనవచ్చుననియు ఛార్లెసు తెలిపెను. డేవిడ్ అందులకు అంగీకరించెను.

"నీ వాతని దగ్గఱకు వచ్చునపుడు చాల జాగ్రత్తగా నుండవలయును. నిన్ను గూఢచారులు కొందఱు వెదకుచుందురు. నీవు వారి కనుగప్పి రావలయును. ఎలన్, నీవు ఒకే సారి పట్టుబడుట తటస్థించినచో నంతకంటె సర్వనాశనము వేఱుండఁబోదు" అని ఛార్లెసు డేవిడ్‌ను హెచ్చరించెను. జాగ్రత్తగానే సంచరింతునని డేవిడ్ చెప్పెను.

ఛార్లెసు స్టీవర్టు తనదారినిఁ బోయెను. అటుపిమ్మట డేవిడ్, కేట్రియోనాను గలసికొనఁ దలఁచెను. అందువలనఁ దిన్నఁగా డీన్ గ్రామమునకు దారితీసెను. ఆనాఁడు జేమ్సుమోర్ మనుజులా దారినిఁ గాపుందురనియుఁ దనను బట్టుకొని దాఁచివైతురనియు డేవిడ్‌కు దెలియును. జేమ్సుమోర్ నీచుఁడు. ఆతఁడెట్టి పాపపు పనికైనను సిద్ధమగును. ఈ విషయములన్నియుఁ దెలిసియు, డేవిడ్ కేట్రియోనాపైఁ గల మమకారమును విడువఁజాలక పోయెను. అందువలన నాతఁ డనేక చిక్కులకు లోనుగావలసి వచ్చెను.

కేట్రియోనా యింటివద్దనే యుండెను. ఆమెను గలసికొనఁగలిగినందుకు డేవిడ్ ఎంతయు సంతసించెను. తరువాత వారిరువురును గలసి భోజనముచేసిరి. కొంతకాలము మంచి కబుర్లతోఁ గడపిరి. అటుపిమ్మట ఎలన్‌ను గలసికొనుటకై డేవిడ్ సిల్వారు మిల్సుకు బయలుదేఱెను.

కేట్రియోనా డేవిడ్‌ను గొంతదూర మనుసరించెను. తరువాత నింటికిఁ దిరిగిపోఁబోయెను. పోవుటకుముందు డేవిడ్ కరమును గైకొని ముద్దులవర్షమును గురిపించెను. డేవిడ్ తిరిగి

క్షేమముగా వచ్చునని తా నాశించుచుంటిననియుఁ దన హృదయ మెప్పుడు నాతనితో నుండుననియుఁ గేట్రియోనా పల్కెను. ఆమె డేవిడ్‌ను వదలలేక, వదలలేక వదలిపోయెను. కేట్రియోనా మాటలు, డేవిడ్‌ను ఆకసమునకు లేవనెత్తెను. కేట్రియోనాను మొదటఁ జూచినప్పటినుండియు డేవిడ్ ప్రేమించియుండెను. కేట్రియోనా ప్రేమ డేవిడ్‌కు ఇప్పుడే అర్థమాయెను.

డేవిడ్ మెల్లన నడచుచు నొక్కసారి చుట్టును జూచెను. ఆతని కొక పొదచాటున నెయిల్ అను పేరుగల సేవకుని తల కాన్పించెను. డేవిడ్ ఆ తల నిదివఱకే యొకసారి హోప్ పార్కువద్దఁ జూచియుండెను. అందువలన నాతఁ డా తలను సులభముగా గుర్తించెను. కొందఱు తనను వెంబడించు చున్నట్లు డేవిడ్ అర్థము చేసుకొనఁగలిగెను. ఛార్లెసు స్టీవర్టు హెచ్చరిక యాతనికి జ్ఞాపకమువచ్చెను. అతని శరీరమంతయు వణకఁజొచ్చెను. ఆతనికిఁ గొంతతడ వేమిచేయుటకును దోఁచ లేదు. కొంతసేపైన పిదప వెనుదిరిగి కేట్రియోనా యింటికిఁ బోయెను.

స్వల్పకాలములో డేవిడ్ తిరిగిరాఁగానే కేట్రియోనా యెంతయు నాశ్చర్యపడెను. పిమ్మట నామె డేవిడ్ ముఖమును బాగుగఁ బరిశీలించెను. అప్పుడామెకు గలిగిన యాశ్చర్యము నకు మితిలేదు.

కేట్రియోనా డేవిడ్‌లోని మార్పునకుఁ గారణము తెలిసికొనఁగోరెను. డేవిడ్ ఇట్లు జవాబిచ్చెను. "ఏమని

చెప్పను? నేనంతకంతకుఁ జిక్కులలోఁబడుచున్నాను. ఎలన్, జేమ్సు స్టీవర్టులు నా క్షేమముపై నాధారపడియున్నారు. నన్ను నీ యింటిదగ్గఱనే కొందఱు వెంబడించుచున్నారు. నన్ను వెంబడించుచున్న దెవరోకాదు. మీ సేవకుఁడు నెయిల్ !"

"ఇది యంతయు నీ యూహ. నీవు పొరపాటుగా నభిప్రాయపడుచున్నావు. నెయిల్ ఇప్పుడిచటలేఁడు. ఎడింబరోలో నా తండ్రివద్ద నున్నాడు. అందఱును నీకు శత్రువులే యని తలఁచుచున్నావు"అని క్లియోపాత్రా నవ్వుచుఁ బలికెను.

"నీకు నవ్వులాటగా నున్నది. నా మాటలలో నసత్యమెద్దియు లేదు. నేనీ క్షణమున మిగుల నపాయకరస్థితిలో నున్నాను. నీ వపాయకరస్థితిలో నున్నట్లు ఊలవేయుము. అపుడు నీకు సర్వమును దేటతెల్లముకాఁగలదు"అని డేవిడ్ మిగుల నుద్వేగముతోఁ బలికెను.

క్లియోపాత్రా నవ్వుచు నొక యీల నైచెను. కొద్దిసేపటిలోనే అక్కడ నెయిల్ ప్రత్యక్షమాయెను. అతని చేతఁ గత్తిగూడ నుండెను. నెయిల్, డేవిడ్ క్లియోపాత్రాలను జూచెను. అతఁడట్లు జరుగునని యూహింపలేదు. అందువలన నాతఁడు నిశ్చేష్టుఁడాయెను.

డేవిడ్ ఏమాటయు ననకపూర్వమే క్లియోపాత్రా కంతయు నర్థమాయెను. ఆమె మానసికముగా నెంత బాధపడెనో వ్రాయుట కలవిగాదు. ఆమె, తన తండ్రి నెంతో గాఢముగఁ బ్రేమించుచుండెను. ఇపుడు తన తండ్రి ప్రభుత్వ

గూఢచారిగాఁ బనిచేయుచున్నాఁడను విషయము అద్దములోఁ ప్రతిబింబమువలె స్పష్టముగాఁ గనఁబడుచుండెను.

డేవిడ్, క్రేటియోనా నోదార్చెను. ఆమె బాధను జూచి యాతఁడు సహింపలేకుండెను. నెయిల్‌ను గొంతసేపటి వఱకు నామెవద్ద నుంచుకొనవలసినదనియు, నప్పుడన్ని విషయములు చక్కఁబడుననియు డేవిడ్ చెప్పెను.

"నేను నా తండ్రి యుదార స్వభావుఁడని, పరులకు హానిచేయఁడని యింతవఱకు భావించితిని. ఇపుడాతని గుణము నాకు బాగుగ నర్థమయినది. నీవు నా తండ్రి నెందుకు గౌర వించుటలేదో నాకిప్పుడు తెలిసినది. ఈ లోకమున నీకంటె మంచివాఁడొరుడు లేఁడు. నా సర్వస్వము నీ యధీనమున నున్నది. నన్ను నీటముంచినను, పాలముంచినను నీవే నాకు శరణ్యము. నిన్ను రక్షించుటకు నే నేపనినైనను జేయుదును. నెయిల్‌ను ఇచ్చటనే నిలిపి యుంచెదను" అని క్రేటియోనా చెప్పెను.

ఆమె మాటలు, ఆమె చూపులు డేవిడ్ కష్టములను పాఱద్రోలెను. డేవిడ్ తిరిగి సిల్వరుమిల్సుకుఁ బ్రయాణ మాయెను. త్రోవలో నాతఁడు పరిపరివిధముల నాలోచింప సాగెను.

"నేను క్రేటియోనాకు హానిచేసితినని భావింతును. ఆమె నెయిల్‌ను ఇంటివద్దనే నిలిపియుంచును. అందువలన నెయిల్, జేమ్సుమోర్ ఆజ్ఞలను నెఱవేర్చుటకువీలులేకుండును. జేమ్సుమోర్ ప్రభుత్వమువారి మన్ననలను గోల్పోవును.

తత్ఫలితముగా నాత దురితీయఁబడును. ఆ దుఃఖమును లేత హృదయముగల కేత్రీయోనా యేమాత్రమును భరింపఁ జాలదు. నేను స్వార్థపరుఁడనై యామె హృదయమునకు బాధ కలిగించుచున్నాను” అని డేవిడ్ విచారింపఁదొడఁగెను.

## 7

ఎట్టకేలకు డేవిడ్ ఎలన్‌ను గలసికొనుటకు సిల్వారు మిల్సుకుఁ జేరుకొనెను. పిమ్మట ఎలన్ ఉండు స్థలమునకుఁ బోయెను. కాని యచ్చట ఎలన్ లేఁడు. అందువలన నాతఁడు చాలకాలము వేచియుండవలసివచ్చెను. కడకు ఎలన్ వచ్చెను.

ఇరువురి యానందమునకు మేర లేకుండెను. డేవిడ్ తన కష్టస్థితియంతయుఁ దెలియఁజేసెను. ఎలన్ సావధానముగా నాలకించెను. పిమ్మట నెలన్ ఇట్లనెను. “మనము వెంటనే ఈ ప్రదేశమును విడువవలయును. నీ రాకపోక లనేకులు గమనించుచున్నారు. ఇచ్చట నుండుట యంత క్షేమకరము కాదని తోఁచుచున్నది.” డేవిడ్ అందుల కంగీకరించెను. వెంటనే వారిరువురును నచ్చోటువీడి పయనమైరి.

వారిరువురును నెడింబరోనగరమునకుఁ దూర్పుదిక్కునఁ గల యొక ప్రదేశమునకుఁ బోవుచుండిరి. ఏలయన ఎలన్ మఱుసటిదినముననే యొక యోడపై ఫ్రాన్సునకుఁ బోవలయును. ఆండీయను నొక యోడకెప్టెను దొంగతనముగాఁ జేరవేయుట కంగీకరించెను. ఈ యేర్పాటు లన్నింటిని ఛార్లెసు స్టీవర్టు గావించియుండెనని వేఱుగాఁ జెప్పనవసరము లేదు.

వారిరువురును రాత్రియంతయు నడచిరి. తెల్లవారు సరికి వారిరువురును సముద్రతీరమునఁగల యొక గ్రామమును జేరుకొనిరి. వారి కాఁకలి మిక్కుటముగ నుండెను. అందు వలన వారిరువురును నొక భోజనశాల ప్రవేశించి భోజనము చేయుచుండిరి. డేవిడ్ కిటికీదగ్గఱ గూర్చుండియుండెను. అతఁడు ఒకసారి కిటికీనుండి బయటకుఁ జూచెను. జేమ్సుమోర్ సేవకుఁడగు నెయిల్ ఆ వీధిలోఁ గనఁబడెను. డేవిడ్ ఆశ్చర్య చకితుఁడాయెను. ఆ విషయమును ఎలన్‌కుఁ దెలిపెను. అతఁడు విభ్రాంతుఁడాయెను.

"నెయిల్ రాత్రియంతయు మనలను వెంబడించు చున్నాఁడని స్పష్టమగుచున్నది. కేట్రియోనా ఈతనిని గొంత తడ వింటికడ నాపియేయుండును. అయినను నీతడు మనల ననుసరింపఁగలిగినాడు. ఇట్టి పనిని సుశిక్షితులగు గూఢచారులు మాత్రమే చేయఁగలరు. మనము వారికంటెఁ బడకుండఁ దప్పించుకొనవలెను." అని డేవిడ్ పలికెను. అందులకు ఎలన్ తన యంగీకారమును దెలిపెను.

ఇరువురును త్వరితముగా భోజనములు ముగించిరి. వేఱొక దారిని సముద్ర తీరమునకుఁ బోసాగిరి. దూరముగా సముద్రమున ఆండీ యోడ వారికిఁ గాన్పించుచుండెను. ఎలన్ ఆ యోడలోని వారికి సంజ్ఞలు చేసెను. ఓడలోని వారు గ్రహించి యొక చిన్న పడవను వారివైపునకుఁ బంపిరి. పడవ సముద్రములోనుండి తీరమునకుఁ బయనము చేయుచుండెను.

వారిరువురును ఊరిలోనుండి తీరమునకుఁ బోవుచుండిరి. వారిరువురును బడవకంటె ముందుగాఁ దీరమును జేరుకొనిరి.

అంతలోఁ బక్షులు లేచి పైన నల్లాడుచుండఁగా వారిరువురును జూచిరి. ఆ దిక్కు-నుండి కొందఱు గూఢచారులు వచ్చుచున్నారని వారిరువురును సులభముగా గ్రహించిరి. కాని గూఢచారులు కనఁబడుట లేదు. డేవిడ్ భయపడఁ జొచ్చెను. పడవ ముందుగాఁ దీరమును జేరిన ఎలన్ రక్షింపఁ బడును. అటులఁగాక గూఢచారులే ముందువచ్చిన వారిరువురును బంధింపఁబడుట తథ్యము.

పడవ ముందుగాఁ దీరమును జేరినచోఁ దనతోఁబాటు పడవలో రావలసినదిగా ఎలన్ డేవిడ్‌ను గోరెను. అట్లు చేయనిచో గూఢచారు లాతనిని బట్టుకొని యెచ్చటనైన బంధింతురనియు, లేక చంపుదురనియు హెచ్చరించెను. కాని యట్లు చేయుటకు డేవిడ్ నిరాకరించెను. తా నిదివఱకే యొక సందర్భమునఁ గ్రేటియోనా కన్యాయము చేసియుంటిననియు నిప్పుడు దానుగూడ దేశమును వదలిన నామె బ్రతుకు వ్యర్థమగుననియు డేవిడ్ వక్కా-ణించెను.

అంతలో ముగ్వురు గూఢచారులు వారినిసమీపించిరి. కాని సంఖ్యాబలము చాలనందున నేమియుఁ జేయక మిన్నకుండిరి. వెనుక వచ్చుచున్న గూఢచారులకొఱకు వేచియుండిరి. అదృష్టవశమునఁ బడవ తీరమును సమీపించెను. ఎలన్ ఫ్రాన్సులోఁ దన విలాసమును డేవిడ్‌కుఁ దెలిపెను. పిమ్మటఁ బడవలోనికి దుమికెను.

పడవ తిరిగి యోడదరికిఁ బయనము చేయుచుండెను. డేవిడ్ పడవవైపునకుఁ జూచుచు శిలాప్రతిమవలె నిలఁబడి యుండెను. అటులఁ జాలకాలము గడచెను. అంతలో మిగిలిన గూఢచారులును నటకు వచ్చిరి. అందఱును నొక్కుమ్మడి డేవిడ్పైఁబడి పట్టుకొనిరి. డేవిడ్ నిస్సహాయుఁడాయెను.

డేవిడ్ కాలుసేతులు బంధింపఁబడెను. గూఢచారులాతని దుస్తులన్నియు వెదకిరి. దొరకిన డబ్బు నందఱును సమానముగాఁ బంచుకొనిరి. కొంతసేపైన తరువాతఁ జాల మంది వెడలిపోయిరి. ముగ్గురు మాత్రమే కాపుండిరి. అందు నెయిల్ ఒకఁడు. మిగిలిన యిరువురుగూడ జేమ్సుమోర్ కుఁ జెందిన మనుష్యులే.

డేవిడ్ వారితో నిట్లనియెను. "మీరు నన్ను దీనస్థితికిఁ దెచ్చినారు, ఇది కేట్రియోనాకుఁ దెలిసినచో నామె యెంతయో విచారించును. మీ యజమానురాలు విచారించుట మీ కిష్టమా?"

అంత వారిలో నొకఁడిట్లనెను. "మిమ్ము చంపుదుమని భయపడుచున్నటులఁ దోఁచుచున్నది. మే మట్టి పని యెన్నఁటికిని జేయము. మీకుఁ గావలసిన సర్వసౌఖ్యములను సమకూర్తుము. స్వేచ్ఛ యను మాటను మాత్రము తాత్కాలికముగా మఱచిపొండు."

డేవిడ్కు ఛార్లెసు స్టీవర్టు మాటలు జ్ఞప్తికివచ్చెను. "జేమ్సు స్టీవర్టు విచారణ పూర్తియగువఱకు నన్నొక

యేకాంతప్రదేశమున బంధింతురు కాఁబోలు'' అని డేవిడ్ తలఁచెను.

అంతలో నొక పడవ యటకు వచ్చెను. మువ్వురు గూఢచారులును డేవిడ్‌ను ఎత్తి పడవలోనుంచిరి. వారుగూడఁ బడవలో నెక్కిరి. పడవలో మఱియొకఁడుండెను. వాని పేరు నల్ల ఆండీ. పడవలో డేవిడ్ కాలు సేతుల బంధములు ఊడ దీయఁబడెను.

కొంతసేపగుసరికిఁ బడవ యొకచిన్నదీవినిఁ జేరుకొనెను. అచట నందఱును బడవనుండి దిగిరి. ఆ దీవిలోఁగల యొక యేకాంతగృహమునకుఁ బోయిరి. అక్కడ డేవిడ్ బంధింపఁ బడెను.

# 8

దీవియందలి యేకాంత గృహమున డేవిడ్, నల్లఆండీ, నెయిల్, మఱి యిరువురు మొత్తమైదుగురు మాత్రమే యుండిరి. వారిలో నాయకుఁడు నల్ల ఆండీ. డేవిడ్ సర్వ సౌఖ్యముల ననుభవించుచుండెను. మంచి దుస్తులు, మంచి భోజనము మున్నగునవెల్లయు సమకూర్పఁ బడుచుండెను. అక్కడఁగల వారందఱు నాతనిపట్ల నత్యంత గారవమును, నమ్రభావమును జూపుచుండిరి. ఆతని కొకటే లోటు. స్వేచ్ఛ యనునది మచ్చునకైనఁ గానరాదు.

డేవిడ్ స్వేచ్ఛకొఱకై యువ్విళ్ళూరు చుండెను. జేమ్సు స్టీవర్టు సెప్టెంబరు నెల ఇరువది యొకటవ తేదీనాఁడు విచారింపఁ బడును. ఆ నాఁటికిఁబోయి సాక్ష్యము నీయవలెనని

డేవిడ్ తలఁచుచుండెను. కాని యాతని కోరిక నెఱవేరు నుపాయము కాన్పింపదాయెను. రోజులు గడచిన కొలఁది నిరాశ హెచ్చుచుండెను. జీవితము దుస్సహమగుచుండెను. అందువలన నాతఁ డెవరినైన మంచి చేసికొని తప్పించుకొన దలఁచెను.

ఒకనాఁడు, డేవిడ్, నల్ల ఆండీనిఁ బిలచి తన కథ యంతయుఁ బూర్తిగాఁ జెప్పెను. జేమ్సు స్టీవర్టును రక్షించుటకుఁ దానెంతయు నాతురము చెందుచుంటినని తెలిపెను. సెప్టెంబరు నెల, ఇరువది మూఁడవ తేదినాఁడు స్వేచ్ఛ ప్రసాదింపబడుననియు, నంతవఱకుఁ జేయునదేమియు లేదనియు నల్ల ఆండీ చెప్పెను. తన నెట్లయిన సెప్టెంబరు నెల, ఇరువది యొకటవ తేదికి ముందుగా విడుదల చేసినచో నెంతయు సంతసింతునని డేవిడ్ నుడివెను. అందుకుఁ బ్రతిఫలముగాఁ దగినంత ధనమిత్తుననికూడ నాతఁడు చెప్పెను. నల్ల ఆండీ లంచము తీసుకొనుటకు నిరాకరించి యిట్లనెను.

"డబ్బిత్తు ననిన నాకుఁ జేదుకాదు. కాని దాని ననుభవించు యోగ్యత యుండవలయును. నీకు నేను స్వేచ్ఛనిచ్చినచో నీవు న్యాయస్థానమునకుఁ బోయి జేమ్సు స్టీవర్టు నిర్దోషి యని యుద్ఘాటింతువనుకొనుము. నీ మాటకు విలువ యీయఁబడునని హామీ ఎక్కడఁగలదు? నీవుకూడ హంతకుని యనుచరవర్గములోనివాఁడ వని నేరమారోపింపఁబడి యురితీయఁబడవచ్చును. అపుడు నీకు దిక్కెవరు? నా మాట యేమగును?

నీ వద్దనుండి నాకు ధనము రాదు; ఉద్యోగము పోవును; రెంటికిఁ జెడిన రేవడివలె నగుదును.”

కొన్ని దినములు గడచెను. ఒకనాఁడు నల్ల ఆండీ యొక కథ చెప్పెను. ఆ సందర్భమున నల్ల ఆండీకి, నెయిల్‌కు భేదాభిప్రాయము వచ్చెను. మాటలు ముదిరెను. కడకుఁ గొట్లాటకు దిగెను. చినుకు, చినుకు గాలివాన యాయెను. నెయిల్ నల్ల ఆండీనిఁ బొడిచి చంపుటకు సిద్ధపడెను. అపుడు డేవిడ్, నల్ల ఆండీని రక్షించెను. నెయిల్‌కుఁ గోపము వచ్చెను. ఆండీకి డేవిడ్ పట్ల భక్తి కుదిరెను.

సెప్టెంబరు నెల, ఇరువది రెండవ తేదినాఁడు, ఆహార పదార్థములతో నొక పడవ యటకు వచ్చెను. అపుడు డేవిడ్ నల్ల ఆండీతో రహస్యముగా నిట్లనెను. “నిన్ని గూఢచారు లెప్పటికైనను జంపఁదలఁచుచున్నారు. నీ జీవిత మపాయస్థితిలో నున్నది. రేపు ఇరువదిమూఁడవ తేది. ఎట్లయినను నాకు స్వేచ్ఛ ప్రసాదింపఁబడును. నీవు నన్ను నేఁడే టీసికొనిపోయి ఇన్వెరరీవద్ద విడువుము. నీవుగూడ నాతో రమ్ము. ఇందుఁ బ్రభుత్వన్యాయవాది యాజ్ఞల నుల్లంఘించుట యేమియు లేదు. పడవ యీ రాత్రి బయలుదేఱును.”

నల్ల ఆండీ బాగుగ నాలోచించెను. డేవిడ్ చెప్పిన మాటలలో నాతని కేద్దియుఁ బొరపాటు గోచరింపలేదు. అందువలన నతఁ డటులచేయుట కంగీకరించెను. ఆ రాత్రి యిరువురును బడవెక్కిరి. డేవిడ్ ఇన్వెరరీ తీరమువద్ద దిగెను. అప్పటికి మఱునాఁడు రెండుగంటలాయెను.

డేవిడ్ ఒకగుఱ్ఱముపై ఇన్వెరరీకి బయలుదేఱెను. మఱు సటిదినమున నాతఁడా ప్రదేశము చేరుకొనెను. అది యాది వార మగుటచేఁ బలువురు 'చర్చి'లో నుండిరి. మతాధికారి బోధనలను వినుచుండిరి. డేవిడ్ లోనికిఁబోయి యొకచోఁ గూర్చుండెను.

డేవిడ్ వచ్చెననువార్త యందఱకును దెలిసెను. ఆర్గయిలు ప్రభువు మండిపడెను. ప్రభుత్వన్యాయవాది గ్రాంటు ఆశ్చర్యపడెను. డేవిడ్ వచ్చుట అతని కేమాత్రము ఇష్టము లేదు. సైమను ఫ్రేజరు కేమాత్రమును ఇష్టములేదు. ఛార్లెసు స్టీవర్టు (సొలిసిటరు) మాత్రము చాల సంతసించెను. అతఁడు గూడ చాల నాశ్చర్యపడెను.

బోధపూర్తియైన తక్షణము ఛార్లెసు స్టీవర్టు డేవిడ్ వద్దకుఁ బోయెను. ఇరువురును గలసి ఛార్లెసు గృహమునకుఁ బోయిరి. ఇదియంతయు నొక త్రుటికాలములో జరిగెను.

"జేమ్సు స్టీవర్టు విచారణయంతయుఁ బూర్తియైనది. న్యాయాధిపతి యింకను దీర్పుచెప్పలేదు. జేమ్సున కురిశిక్ష విధింపఁబడుట తప్పదు." అని ఛార్లెసు స్టీవర్టు, డేవిడుకుఁ దెలిపెను.

డేవిడ్ తన కథయంతయు ఛార్లెసుకుఁ దెలిపెను. ఛార్లెసది యంతయు బాగుగావిని యిట్లనెను. "ఈ యన్యాయమును న్యాయస్థానదృష్టికిఁ దీసికొనిరావలయును. లేనిచో న్యాయము నకు విలువయుండదు. ఆర్గయిలు ప్రభువు, ప్రభుత్వ న్యాయ వాది గ్రాంటు మున్నగు కుట్రదారులందఱును దప్పక శిక్షింపఁ

బడుదురు. అన్యాయవాదులు నశింపక తప్పదు. ఈ విధముగ నైనను మా వంశమునకు విరోధులైన కాంబెలు వంశీయులు నశించుట మిగుల సంతోషకరమైన విషయము. మనము తప్పక చర్య తీసికొనవలెను."

తరువాత జేమ్సు స్టీవర్టును రక్షించుటకు నియమింపబడిన న్యాయవాదుల కీసంగతి యంతయు సవిస్తరముగఁ దెలుపఁబడెను. ఆ న్యాయవాదులెల్లరు స్వార్థపరులు. వారెల్లరు ముక్తకంఠముతో నా విషయమును న్యాయస్థాన దృష్టికిఁ దీసికొని రావలెనని తెలిపిరి. గ్రాంటు తన ప్రభుత్వ న్యాయవాది యుద్యోగమును గోల్పోవుట తథ్యమని వారెల్లరు నభిప్రాయమును వెలిపుచ్చిరి. ఇతరులు పోఁగొట్టుకొనిన యుద్యోగములను తాము పొందవచ్చునని వారు భావించిరి. ఇట్టి స్వార్థభూయిష్ట విషయములలో మునిఁగి వారు ముఖ్యమైన జేమ్సు స్టీవర్టు విషయమునే మఱచిరి.

డేవిడ్‌కు మిగులఁ గోపము వచ్చెను. జేమ్సు స్టీవర్టు రక్షింపఁబడునో, రక్షింపఁబడఁడో తెలుపవలసినదని వారి నడిగెను. వారు తమకేమియుఁ దెలియదనిరి. డేవిడ్ సహనము కోల్పోయెను. జేమ్సు స్టీవర్టు పట్ల దయ చూపవలసినదని యొక విన్నపమును జార్జిరాజుకుఁ బంపినచో బాగుండునని యాతఁడు తెల్పెను. అందుల కందఱును నంగీకరించిరి.

విన్నపము తయారు చేయఁబడెను. దాని ప్రతి నొక దానినిఁ దనకీయవలెనని డేవిడ్ వారినిఁ గోరెను. అటులఁ జేయుటకు వారు నిరాకరించిరి. డేవిడ్ అందులకుఁ గారణము

తెలిసికొనఁ గోరెను. అదియొక రహస్య పత్రమని వారు చెప్పిరి.

డేవిడ్ మిగులఁ గోపించి వారితో నిట్లనెను. "మీరందఱును స్వార్థపరులవలెఁ దోఁచుచున్నారు. ప్రభుత్వ న్యాయవాది తెలఁచుకొనినచో నన్నుఁ జంపించి యుండెడివాఁడు. లేక నాపై హత్యా నేరారోపణచేసి కారాగారమునకుఁ బంపించి యుండెడివాఁడు. అట్టి సందర్భమున నేనిప్పుడు మీతో మాటలాడు చుండెడివాఁడను గాను. నే నేపనియు నాయనకుఁ దెలియకుండఁ జేయను. ఈ విన్నపము నాయనకుఁ జూపవలసిన నైతిక బాధ్యత నాపైఁ గలదు."

అప్పుడు వారందఱును నంగీకరించి, యొక ప్రతిని డేవిడ్ కిచ్చిరి.

## 9

డేవిడ్ తిన్నఁగాఁ బ్రభుత్వన్యాయవాది గ్రాంటు ఇంటికిఁ బోయెను. గ్రాంటును గలసికొనెను. ఆయన మన స్సేమియు బాగుండలేదు. ఆ సమయమున డేవిడ్ అచటకు వచ్చుట యాయన కంతగా నిష్టములేకుండెను. అందువలన నాతఁడు డేవిడ్‌ను ముక్తసరిగాఁ బలుకరించెను. డేవిడ్ ప్రభుత్వ న్యాయవాది యభిప్రాయమును గ్రహించెను. తాను గ్రహించిన సంగతిని గ్రాంటునకుఁ దెలియఁజేసెను.

వచ్చినపని యేమని డేవిడ్‌ను బ్రభుత్వన్యాయవాది ప్రశ్నించెను. డేవిడ్ తనవద్దనున్న 'విన్నపము' నా ప్రభుత్వ

న్యాయవాది కిచ్చి దానినిఁ దీరుబడిగాఁ జదువవలసినటుగాఁ గోరెను. ప్రభుత్వ న్యాయవాది దానినిఁ బూర్తిగ, సావకాశముగఁ జదివెను. అతఁడేమియు జలింపనివానివలె నుండెను. అపుడు ప్రశాంతముగా "ఇప్పుడు నే నేమిచేయవలయును?" అని ప్రశ్నించెను.

డేవిడ్ ఇట్లు చెప్పెను. "దీనిని మేము జార్జిరాజునకుఁ బంపుచున్నాము. ముందు మీకుఁ జూపు నైతికబాధ్యత నాకుఁ గలదని తీసికొనివచ్చితిని."

ప్రభుత్వన్యాయవాది యా మాటల కెంతయు సంతసించెను. తనవద్దనే యుండవలసినదని డేవిడ్‌ను ఆహ్వానించెను. డేవిడ్ ఎట్టిసమాధానము నీయక మౌనము దాల్చెను. తన యాహ్వానమునకు సమాధానము చెప్పవలసినదని ప్రభుత్వ న్యాయవాది మరలఁ గోరెను.

అంత డేవిడ్ ఇటులనియెను. "ఈ విన్నపమును బంపునది నేను. అట్టి నేనే వ్యతిరేక పక్షమునకుఁ జెందిన మీయింట బసచేసిన విన్నపమున కింక విలువ యేమికలదు?"

"నీ నిశితబుద్ధి కెంతయు సంతసించుచున్నాను. కాని నేనొక్క విషయమును జెప్పెదను వినుము. ప్రస్తుత పరిస్థితులలో జేమ్సు స్టీవర్టు ఉరినాపుటకు భగవంతునకుఁ గూడ దరముకాదని నమ్ముము. ఈ సంగతి అర్గయిలు ప్రభువుకుఁ దెలిసినచో నిన్నుఁ జంపక, బ్రతికియుండనిచ్చి నందులకు నన్నెంతయు నిందించును. నేను, అతఁడు ఆజన్మాంతము

శత్రువులుగా నుండవలెను. దీనివలన లాభము బొందువారెవరును లేరు. అంతయు నష్టమే.

"నీకు నేను ప్రాణదానము చేసితిని. నీవు నాకుఁ బ్రత్యుపకారము చేయవలయును. ఈ విన్నపమునుఁ బైకిఁబంపవలదు. నీకుఁ బెద్ద పెద్దవారితోఁ బరిచయము చేయుదును. నీకు అన్ని విధముల లాభము కలుగునటులఁ జేయుదును."

డేవిడ్ బాగుగా నాలోచించెను. తన విన్నపమువలన నెవరికిని లాభము కలుగదని యతఁడు గ్రహించెను. అతఁడు న్యాయవాది కాఁదలఁచెను. అందులకు గ్రాంటు సాహాయ్యమవసరము. కావున నాతఁడు తన విన్నపమును బైకిఁ బంపకుండుటకును, నతనియింట బసచేయుటకును నంగీకరించెను. జేమ్సు స్టీవర్టు విషయము వదలివేయఁబడెను.

డేవిడ్, ప్రభుత్వ న్యాయవాదితో ఇన్వెరరీలోఁ గొన్ని నాళ్లుండెను. తరువాతఁ బ్రభుత్వ న్యాయవాది గ్లాస్గోకుఁ బోయెను. అతనితోఁబాటు డేవిడ్ కూడఁ బోయెను.

ప్రభుత్వ న్యాయవాది మాట నిలకడకలవాఁడు. అతఁడు డేవిడ్‌ను బలువురకుఁ బరిచయము చేసెను. డేవిడ్‌ను బొగడుచు నాయన పలువురకుఁ జెప్పెను. డేవిడ్ జీవితము సుఖముగఁ గడచుచుండెను.

ఒకనాఁడు ప్రభుత్వ న్యాయవాది కొక యుత్తరము వచ్చెను. దాని నాయన పెద్దకుమార్తె వ్రాసెను. అందిట్లున్నది.

"కేట్రియోనా యొక్క చెప్పులు కుట్టువాని వేషమును ధరించి యామె తండ్రియున్న కారాగారములోనికిఁ బ్రవేశించెను. తన దుస్తులను తండ్రి కిచ్చెను. తండ్రి జేమ్సు మోర్ చెప్పులు కుట్టువాని వేషమున బయటకుఁ బోయెను. కేట్రియోనా కారాగారములో నుండెను."

డేవిడ్ ఆ యుత్తరమును జదివెను. వెంటనే యాతఁడు ఎడింబరోకుఁ బోయి కేట్రియోనాను జూడఁదలఁచెను. ఆ విషయము నాతఁడు ప్రభుత్వ న్యాయవాదికిఁ దెలిపెను. ప్రభుత్వ న్యాయవాది తన కామెపై మమకారమునకుఁ గారణము తెలిసికొనఁ దలచెను గాని తరువాత డేవిడ్ పోవుటను ననుమతించెను.

డేవిడ్ వెంటనే గుఱ్ఱము నెక్కి ఎడింబరో నగరమునకుఁ బోయెను. అచటఁ బ్రభుత్వన్యాయవాది గుమాస్తాను గలసికొని కేట్రియోనా విషయ మడిగెను. ఆమె క్షమింపఁబడినదనియు నెచ్చటకుఁ బోయినదో తెలియదనియు గుమాస్తా చెప్పెను. పిమ్మట డేవిడ్, గ్రాంటు పెద్ద కుమార్తె బార్బరా వద్దకుఁ బోయి కేట్రియోనా విషయ మడిగెను. ఆమె సమాధాన మేమియుఁ జెప్పలేదు. అంత నాతఁడు డీన్ గ్రామమునకుఁ బోయెను. ఇంటివద్దఁ గేట్రియోనా కనఁబడలేదు. డేవిడ్ విఫల మనోరథుఁడై తిరిగి ఎడింబరో నగరమునకుఁ బోయి బార్బరాను గలసికొనెను.

డేవిడ్, బార్బరాలు అనేక విషయములను ముచ్చటించుకొనిరి. ఆ సందర్భమున బార్బరా, డేవిడ్‌కు ఇటులఁ

జెప్పెను. "నీవు నెయిల్‌ను గేట్రియోనా వద్దఁ గొంతసేపు నిలఁబెట్టిన దినమును జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. ఆనాఁడు కేట్రియోనా నావద్దకువచ్చి అన్నివిషయములను దెలిపినది. నీవు నామెయందమునకు ముగ్ధుఁడనైనానని యామెతోఁ జెప్పితివట. ఈ ప్రపంచమున నీకు నేనుమాత్రమే స్నేహితురాలనని యామెతోఁ జెప్పితివఁట. ఆమె యింకను నిట్టి విషయములను దెలిపి నీ ప్రాణములను, దన తండ్రి ప్రాణములను రక్షింపవలసినదని ప్రార్థించినది. నేను దయతలఁచి యామెను నా తండ్రి వద్దకుఁ దీసికొనిపోతిని. ఆమె మరల నా తండ్రి కన్నివిషయములను దెలిపెను. అతఁడు నీ ప్రాణములను, నామె తండ్రి ప్రాణములను రక్షించుటకు వాగ్దానము చేసెను. మీరిరువురు నట్లులే రక్షింపఁబడిరి.

ఆర్గయిలుప్రభువు మున్నగువారందఱును దనను జంపుటకుఁ బ్రయత్నించినను, బ్రభుత్వన్యాయవాది యెందులకు రక్షించెనో డేవిడ్‌కు అర్థమాయెను. అతఁడు గ్రాంటును, బార్బరాను, గేట్రియోనాను ఎంతయుఁ గొనియాడెను.

"కేట్రియోనా ఎక్కడనున్నది?" అని డేవిడ్ ప్రశ్నించెను.

"నేను జెప్పను. నీవు చూడవలసిన యవసరములేదు. నీవు చూడరాదు. నేను గఠినురాలనని భావించినను నష్టములేదు." అని బార్బరా చెప్పి యచ్చోటు వీడిపోయెను.

కేట్రియోనా విషయమును దెలిసికొనుటకు డేవిడ్ ఎంతో ప్రయత్నించెను. కాని యేమాత్రము లాభము లేక

పోయెను. జేమ్సు మోర్ రహస్యముగా స్కాట్లండునుండి వేఱొక దేశమునకుఁ బంపఁబడినాఁడనియుఁ, గేట్రియోనా రహస్యముగా నెదర్లాండ్సులోనే యున్నదనియు డేవిడ్ తరు వాతఁ దెలిసికొనెను.

డేవిడ్, న్యాయశాస్త్రమును జదువుటకు హాలండులోని లేడన్‌కుఁ బోవుటకు నిశ్చయింపఁబడెను. కేట్రియోనా యెక్కడనున్నదో తెలుపవలసినదని డేవిడ్ మరల బార్బరా నడిగెను. డేవిడ్‌కు వీడ్కోలిచ్చుటకు నోడవద్దకు వచ్చునని బార్బరా తెలిపెను.

డేవిడ్ హాలండుకుఁ బ్రయాణమై పోవురోజున "నీకు నేను వందనము సలుపవచ్చునా?"యని యొంటరిగా నున్న బార్బరా నడిగెను.

బార్బరాకుఁ గోపమువచ్చెను. "క్షమింపు"మని డేవిడ్ కోరెను. ఆ మఱుక్షణముననే బార్బరా డేవిడ్‌ను గ్రుచ్చి కౌఁగిలించుకొని ముద్దుల వర్షము కురిపించెను.

# 10

డేవిడ్ చాల పెందలకడనే రేవుకుఁబోయి యోడ నెక్కెను. అప్పటికందింకే ప్రయాణికులు లేరు. వీడ్కోలిచ్చు టకుఁ గేట్రియోనా వచ్చునని బార్బరా చెప్పియుండెను. అందువలన నాతఁడు కేట్రియోనాకొఱ కెదురు చూచు చుండెను.

అంతలో నక్కడి కొక పడవ యేతెంచెను. అందుండి క్రేటియోనా యోడలోని కెక్కెను. ఆమె తనకు వీడ్కోలిచ్చుటకే వచ్చినదని డేవిడ్ భావించెను. తరువాత నాతని కొక సంగతి తెలిసెను. ఆమె హాలండులోనున్న తన తండ్రినిఁ గలసికొనుటకై యా యోడలోనే ప్రయాణము చేయుచుండెను.

తనకు వీడ్కోలిచ్చుట కచటికి డేవిడ్ వచ్చెనని క్రేటియోనా భావించెను. కాని తరువాత నాతఁడు హాలండులో న్యాయశాస్త్రము జదువుటకుఁ బోవుచున్నాఁడని క్రేటియోనా తెలిసికొనెను.

ఈ విధముగా జరుగునటులఁ జేసినది బార్బరాయని వేఱుగాఁ జెప్పవలసిన యవసరము లేదు. ఆమె చాకచక్యమట్టిది.

ఓడలోఁ గ్రేటియోనా, తనకు బార్బరా వ్రాసిన యుత్తరము నొకదానినిఁ బైకితీఁసెను. అందు డేవిడ్కుఁ గూడ నొక యుత్తరముండెను. క్రేటియోనా దానిని డేవిడ్కు ఇచ్చెను. ఆ యుత్తరమున నంత ముఖ్యమైన విషయములు లేవు. బార్బరా, డేవిడ్ పై గురిపించిన ముద్దులకు సంబంధించిన హాస్యమొకటి యందు వ్రాయఁబడి యుండెను. డేవిడ్ దానినిఁ జాలఁదేలికగాఁ దీసికొనెను. డేవిడ్, క్రేటియోనాలు సుఖముగా నోడలోఁ బ్రయాణము చేయుచుండిరి. ఒకనాఁడు క్రేటియోనా- బార్బరా డేవిడ్కు వ్రాసిన యుత్తరమును జదువుట తటస్థించెను. అందులో ముద్దులను గూర్చిన వాక్య

మును జదివినపుడామె మండిపడి యది నిజమేనాయని డేవిడ్‌ను అడిగెను. "ముద్దు పెట్టుకొనినదో దప్పేమి?" యని డేవిడ్ ప్రశ్నించెను. అటులయినచో దినతో మాటాడవలదని కేట్రియోనా దూరముగాం బోయెను. డేవిడ్ ఆమెను వేడుకొనెను. ఇంకముందు బార్బరాను గలసికొననని యొట్టు పెట్టుకొనుమని డేవిడ్‌ను గోరెను. డేవిడ్ నిరాకరించెను. డేవిడ్, కేట్రియోనాల మధ్య నగాధ మేర్పడెను. వారిరువురకు నెడ మొగము, పెడ మొగము ఆయెను.

కొన్ని దినము లాయెను. కేట్రియోనా దిగవలసిన రేవు వచ్చెను. అపుడు సముద్ర మల్లకల్లోలముగా నుండెను. మఱియుం గేట్రియోనా యెక్కవలసిన పడవలోం జాలమంది యనాగరికులగు బెస్తవారుండిరి. అట్టివారి మధ్యం గేట్రియోనావంటి యువతి ప్రయాణము చేయుట మిగుల నపాయకరము. కేట్రియోనా కష్టస్థితిలో నుండెను. అందువలన డేవిడ్ గతమును మఱచి, యచ్చటనే దిగి కేట్రియోనాకు సాయము చేయందలంచెను.

పడవప్రయాణ మంత సౌఖ్యముగా లేకుండెను. ఎట్టకేలకుం బడవ యొడ్డును జేరెను. ఇరువురును నచ్చట దిగిరి. కేట్రియోనా, డేవిడ్‌ను ఎంతయు బ్రశంసించెను. అటుపిమ్మట వారిరువురు జేమ్సుమోర్ యిచ్చిన విలాసముగల యింటికిం బోయిరి. అక్కడ జేమ్సుమోర్ లేడు. ఆ యింటియజమాని జేమ్సుమోర్‌ను దూలనాడి వారిరువురను దరిమివైచెను.

అందువలనఁ జేయునదిలేక వారిరువురును నొక భోజనశాల కేగి కొన్ని తినుబండారములను భుజించిరి.

డేవిడ్‌తో లేడన్‌కుఁ బోవుటకుఁ గ్రేటియోనా అంగీకరించెను. "ఈ ప్రపంచమున నాకు వేఱు దిక్కెవ్వరును లేరు. నా తండ్రి నన్ను విడనాఁడినాఁడు. నీవే నాకు రక్షకుఁడవు" అని క్రేటియోనా డేవిడుతోఁ జెప్పెను. అంత వారు లేడన్‌కుఁ బోవుట కొక యద్దెబండినిఁ గుదుర్చుకొనఁ బ్రయత్నించిరి. కాని డేవిడ్ తన జేబును దడిమి చూసికొనఁగా డబ్బునెవరో యపహరించినటుల స్పష్టమాయెను.

ఏమాత్రము ఆలస్యము చేయక వారిరువురును లేడన్‌కు నడచిపోయిరి. డేవిడ్ లేడన్ చేరఁగనే, స్కాట్లండు బ్యాంకు ప్రతినిధులవద్దకుఁ బోయి తనకుఁ గావలసినంత సొమ్మును దీసికొనెను.

పిమ్మట వారిరువురు నొక యద్దెయింటినిఁ గుదుర్చుకొని కలసి నివసింపసాగిరి. అన్నాచెల్లెండ్రవలె మెలఁగసాగిరి. అందఱితో నటులే చెప్పిరి. వారి బాహ్యప్రవర్తనకు, ఆంతరంగిక ప్రవర్తనకు నెట్టి భేదము లేకుండెను.

డేవిడ్ న్యాయకళాశాలలోఁ జేరెను. ఆతఁడు క్రేటియోనాతో నెక్కువగా మాటాడఁదలంచలేదు. అందువలనఁ బగలంతయుఁ గళాశాలలోఁ గడపి రాత్రివేళ కింటికి వచ్చెడివాఁడు. వచ్చిన వెంటనే పుస్తకములను ముందుపెట్టుకొని కూర్చుండి చదువుకొనుచుండెడివాఁడు. డేవిడ్ ఇటులఁ జేయుట క్రేటియోనాకు మిగులఁ గష్టముగా నుండెను. ఆమె డేవిడ్

యుద్దేశ్యమును సరిగా గ్రహింపలేదు. ఆమె యన్ని విషయము లకుఁ బూర్తిగా డేవిడ్‌పై నాధారపడియుండెను. అందువలన నామె డేవిడ్ మూకీభావమును సరిగా నర్థము చేసికొనలేక తన నొక భారముగా నెంచుచున్నాఁడని తలఁచెను.

డేవిడ్ భావము వేఱు. వారిరువురు నొకరినొకరు ప్రేమించుకొనిరి. కాని వివాహము కాలేదు. ప్రస్తుతము వారి సంబంధము వేఱు. ఒకరు పోషించుచున్నవారు. మఱి యొకరు పోషింపఁబడుచున్నవారు. అట్టియెడ స్వేచ్ఛగాఁ దిరిగినచో ప్రేమసల్లాపములు జరుగవచ్చును. అపుడు కేట్రియోనా డేవిడ్‌ను గూర్చి "నన్ను బోషించుచుండుటవలన నెక్కువ స్వేచ్ఛను దీసికొనుచున్నాఁడు" అని తప్పుగా భావింపవచ్చును. ఇటుల నిరువురును నొకరినొకరు సరిగా నర్థము చేసికొనకుండిరి.

అంతలో నొకనాఁటి రాత్రి కేట్రియోనా తండ్రి జేమ్సుమోర్ అక్కడకు వచ్చి తలుపు తట్టెను. డేవిడ్ లేచి తలుపు తెఱచెను. తన కొమార్తెను జూచుటకు వచ్చితినని జేమ్సు చెప్పెను. కేట్రియోనా ప్రక్కగదిలోఁ గలదని డేవిడ్ తెలిపెను. యౌవనములోనున్న పురుషుఁడు, స్త్రీ యొకేయింట నున్నందు కాతఁడు మిగులఁ గోపించి తన యసమ్మతినిఁ దెలిపెను. జేమ్సుమోర్ అభిప్రాయము బాగుగానే యున్న దనియుఁ గాని యంతకాలము కేట్రియోనాను దనపై వదలి వేయుటకుఁ గల కారణమేమో తెలుపవలసినదనియు డేవిడ్

కోరెను. అప్పుడు జేమ్సుమోర్ పరుషభాషణముల నుపయోగించెను.

డేవిడ్ కోపించి యిటులనెను. "నీ కొమార్తె, నేను అవినీతిగాఁ బ్రవర్తించియుండలేదు. నీ కొమార్తెనే యడుగుము. ఆమె నీకు సర్వము తెలుపును. కాని నే నింతవఱకు నీ కొమార్తెకై ఖర్చుపెట్టిన సొమ్ము నిచ్చి యిటనుండి కదలుము. అప్పుడు నీ కొమార్తెను దీసికొనిపొమ్ము."

జేమ్సుమోర్, డేవిడ్ కాళ్ళపైఁబడెను. "కేట్రియోనా తండ్రిని క్షమించి రక్షింపుము"అని ప్రార్థించెను. డేవిడ్ కరుణవహించి, జేమ్సుమోర్నుగూడఁ బోషింప సాగెను. జేమ్సుమోర్ ఇంటనుండుటవలన, డేవిడ్ కేట్రియోనాతోఁ గొలఁది సేపైనను మాటాడకుండెను. అందువలన నామె కోప మతిశయించెను.

ఒకనాఁడు డేవిడుకు రెండు ముఖ్యమైన యుత్తరములు వచ్చెను. ఒకటి బార్బరావద్దనుండి వచ్చెను. అందొక (యు)శుభవార్త యుండెను. డేవిడ్ బాల్ఫరు పినతండ్రి, ఎబెనజరు బాల్ఫరు మరణించెను. అందువలన డేవిడ్ ఆస్తికంతటికి నధికారియాయెను. రెండవది డన్కిర్కులో నివసించుచున్న ఎలన్ వద్దనుండి వచ్చెను. త్వరలో లేడన్కు వచ్చుచున్నట్లాతఁడు వ్రాసెను.

ధనవంతుఁడగు డేవిడ్కుఁ దన కొమార్తెనిచ్చి వివాహము చేయవలెనని జేమ్సుమోర్ తలఁచెను. ఆ విషయమును డేవిడ్తోఁ జెప్పి, యామె యంగీకారమునుగూడ సంపాదింతు

ననెను. ఆమెను వివాహము చేసికొనుటకు తన కిష్టమేయనియు నామె యిష్టమును దానే కనుగొందుననియు డేవిడ్ చెప్పెను. ఈ సంభాషణ జరుగుచున్న సమయమున క్రేటియోనా యింట లేదు.

క్రేటియోనా యింటికి వచ్చినతరువాత నామెను వాహ్యాళికిఁ దీసికొనిపోయి డేవిడ్ తనకు, జేమ్సుమోర్‌కు జరిగిన సంభాషణను బూసగ్రుచ్చినటులఁ జెప్పెను. "నీవు నన్ను వివాహము చేసికొనుట కిచ్ఛగింతువా?" అని డేవిడ్ సూటిగాఁ బ్రశ్నించెను. క్రేటియోనా, డేవిడ్‌పట్ల కోపము కలిగి యుండెనుగదా! అందువలన నామె డేవిడ్‌ను వివాహము చేసికొనుటకు నిరాకరించి కటువుగా మాటాడెను. డేవిడ్ ప్రతిమాటఁ జొచ్చెను. క్రేటియోనా కోప మతిశయించుచుండెను. ఆమె యంతకంతకు బిగియఁజొచ్చెను. మఱియు నామె యిటులనెను.

"నీ యింట నున్నానని నీచముగాఁ దలఁచుచున్నావు కాఁబోలు. ఈ క్షణముననే నీ యిల్లు, ఈ యూరు విడిచి పోదును."

"అట్లే చేయుము" అని డేవిడ్ కోపముతోఁ బలికెను.

వెంటనే జేమ్సుమోర్, క్రేటియోనా లా యూరు విడచిపోయిరి.

## 11

క్రేటియోనాలేని డేవిడ్ జీవితము నిస్సారమై ఎడారివలె నుండెను. అతని కేమియుఁ దోఁచకుండెను. అంతలో

ననుకొనిన దినమున ఎలన్ వచ్చెను. ఇరువురును సుఖముగాఁ గాలక్షేపము చేయసాగిరి. వెనుకటి దినములు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచుండిరి.

ఒకనాఁడు డేవిడ్‌కు, జేమ్సు మోర్ వద్దనుండి యొక జాబు వచ్చెను. అందిట్లుండెను. "నేను క్రేటియోనాతో డన్కిర్కులో నివసించుచున్నాను. క్రేటియోనా నిన్నుఁ గలసికొని మాటాడవలెనని గాఢముగా వాంఛించుచున్నది. కావున నీవొకసారి యిచటకుఁ దప్పక రావలయునని ప్రార్థించుచున్నాను. ఎలన్‌తోఁ గొన్ని ప్రత్యేక విషయములు మాటడవలసియున్నది కావున నీతో నాతనిని గూడఁ దప్పక యిటకుఁ దీసికొని రావలయును...... ..."

డేవిడ్ క్రేటియోనానుఁ జూడఁదలఁచుచుండెను. ఎలన్ ప్రత్యేక విషయములను దెలిసికొనఁ దలఁచెను. అందువలన నిరువురును వెంటనే పయనమై డన్కిర్కుకుఁ బోయిరి. రాత్రి యగు సరికి నూరిబయటనున్న క్రేటియోనా గృహమునకుఁ బోయిరి.

క్రేటియోనా అతిథుల నాదరించెను. డేవిడ్‌తో ప్రశాంతముగా, ముక్తసరిగా మాటాడెను. ఎలన్‌తో స్వేచ్ఛగా మాటాడసాగెను. అంతలో జేమ్సుమోర్ వచ్చెను. క్రేటియోనా మౌనము వహించెను.

మఱునాఁటి యుదయమున నలువురును గలసి భోజనము చేసిరి. "నాతోఁ జెప్పవలసిన ప్రత్యేక విషయము లెవ్వి?" అని ఎలన్ ప్రశ్నించెను. "ఆ విషయము సాయం

కాలము మాటాడుద" మని బదులిడి జేమ్సుమోర్ గృహ మును వీడిపోఁజొచ్చెను. కొమార్తెను బిలిచి యొక పనిని జేయుమని రహస్యముగాఁ జెప్పెను. అందులకామె యంగీక రించెను. పిమ్మట మేడపైకిఁ బోయెను. జేమ్సుమోర్ నేదో ద్రోహమును దలపెట్టినాఁడని తలఁచి ఎలన్ అతని ననుసరించెను.

డేవిడ్ ఒంటరితనమును సహింపఁజాలక సముద్ర తీరము నకుఁ బోయెను. అక్కడఁ గేట్రియోనా గూడ నున్నచో నెంతో మనోహరముగా నుండునని తలఁచెను.

అంతలో నచటఁ గేట్రియోనా ప్రత్యక్ష మాయెను. ఆమె డేవిడ్‌ను జూడలేదు. ఆమె తిన్నఁగా నీటియంచు వఱకుఁ బోయెను. అచ్చటఁగల నొక పడవలోనున్న యొక నావికోద్యోగి యామెకొక యుత్తరము నిచ్చెను. ఆమె దానినిఁ గైకొని యింటికిఁ దిరిగిపోఁబోవుచుండెను. అప్పుడు డేవిడ్ పోయి ఆమెను గలసికొనెను. కేట్రియోనా ముఖమున బాధ స్పష్టముగాఁ గనఁబడుచుండెను. ఆ బాధకు నా యుత్తర మునకు నేదో సంబంధము కలదని డేవిడ్ భావించెను.

డేవిడ్:- నన్నుఁ బెండ్లి చేసుకొనెదవా?

కేట్రియోనా:- నీవింకను నన్నుఁ బ్రేమించుచున్నావా?

డేవిడ్:- ముమ్మాటికిని.

కేట్రియోనా:- అయినచో నేను నీదాననే. మనల నింకెవరును విడదీయఁ జాలరు. దుర్మార్గుఁడగు నా తండ్రి నుండి నన్ను రక్షింపుము.

డేవిడ్:- ఇప్పుడు నీ తండ్రివలన నేమి వచ్చినది ?

కేట్రియోనా:- అతఁడు దేశద్రోహి. ఎలన్‌ను జార్జి రాజుకుఁ బట్టి యిచ్చుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు.

అంతలో ఎలన్ అచటకు వచ్చెను. కేట్రియోనా తన వద్దగల యుత్తరము నాతనికిఁ జూపెను. ఆ సాయంకాలము ఎలన్‌ను బ్రిటిషు వారికిఁ బట్టియిచ్చునట్లు ఆ యుత్తరములో నుండెను.

ముగ్గురును గలసి వేగముగా నింటికిఁబోయి ప్రయాణమునకు సిద్ధము గుచుండిరి. అంతలో జేమ్సుమోర్ అక్కడకు వచ్చెను. ఎలన్ ఆతనిని గత్తితోఁ బొడువఁ బోయెను. తన తండ్రిని రక్షింపవలసినదని కేట్రియోనా ప్రార్థించెను. జేమ్సుమోర్ క్షమింపఁబడెను. అతఁ డెటకో పోయెను.

ఎలన్, కేట్రియోనా, డేవిడ్ డన్కిర్కు పట్టణమునకుఁ బోయిరి. అచ్చటనుండి వారు పారిసుకుఁ బ్రయాణము గట్టిరి. పారిసులో డేవిడ్, కేట్రియోనాల వివాహము వైభవముగ జరిగెను. వారిరువురును బారిస్‌లోఁ గొన్ని దినములు గడపిన పిదప నెట్టి కష్టమును లేక స్కాట్లండుకుఁ బోయిరి.

స్కాట్లండులో వారిరువురును బూర్వ విషయముల నప్పుడప్పుడు తలఁచుకొనుచు, నవ్వుకొనుచు సుఖముగాఁ గాలక్షేపము చేయుచుండిరి. వారి యానందమున కెట్టి కొఱఁతయును లేదు.

ఓమ్

---

56

# తప్పక చదువతగినవి

| | | |
|---|---|---|
| అబల (నవల) | | 3-0-0 |
| సౌదామిని (నవల) | | 2-8-0 |
| కథానికలు | | 1-0-0 |
| డికెన్సు కథలు | మొదటి భాగం. | 1-8-0 |
| ,, ,, | రెండవ భాగం. | 1-12-0 |
| స్టీవెన్సన్ కథలు | | 1-12-0 |
| ప్యూమా కథలు | | 1-12-0 |
| స్కాటు కథలు | | 1-12-0 |
| డాక్టర్ & అంకుల్ | | 1-0-0 |
| నీతికథాంజలి 7 భాగముల సెట్టు | | 3-8-0 |

## హిందీ పుస్తకములు

| | |
|---|---|
| హిందుస్తానీ తెలుగు శిక్షక్ | 0-4-0 |
| హిందుస్తానీ స్వయంశిక్షక్ | 1-8-0 |
| హిందుస్తానీ వ్యాకరణ సంగ్రహ్ | 1-0-0 |

**మారుతిరామా అండ్ కో., విజయవాడ.**



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B195 |
| పుస్తకం పేరు | స్టీవె న్ సన్ కథలు 01 |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 157 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Bannu |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |